దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరిక్రొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్‌దీప్‌కి.




# మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

Mudra/RTL 1198 TEL




### ఎయిడ్స్

'అమెరికా ప్రజలని భయ విహ్వాలులని చేస్తున్న ప్రాణాంతకమైన అంటువ్యాధి 'ఎయిడ్స్' డాక్టర్ కె. వెంకటేశ్వరరావుగారి వ్యాసంవల్ల యువతరం ఎంతో మెలకువతో వ్యవహరించటానికి దోహదపడుతుంది. డాక్టర్ గారికి పత్రికాముఖంగా నా అభినందనలు తెలియచేస్తున్నాను.

పి. వి. రామనాథరావు (మధిర)

### న్యూఢిల్లీ లేఖ

5-8-1983 సంచికలోని డాక్టర్ జయ్‌దుబాషీగారి 'న్యూఢిల్లీ లేఖ' చదివాను. జయ్‌దుబాషి గారన్నట్లు భారత జట్టు ప్రపంచ క్రికెట్ కప్ గెలవడానికి ఇవ్వవలసిన దానికన్నా పత్రికలు ఎక్కువ ప్రాముఖ్యాన్నే ఇచ్చి ఉండవచ్చు. కాని జయ్‌దుబాషీగారు 'ఏదో ప్రమాదవశాత్తు భారతజట్టు సాధించిన విజయం' అని వ్రాయడం దురదృష్టకరం.

భారతజట్టు ఆస్ట్రేలియాపై గెలుపొంది సెమీఫైనల్స్‌లో ఇంగ్లాడ్‌తో తలపడవలసి రావటం ఇంగ్లాండ్ జట్టు అదృష్టమని, తరువాత సెమీఫైనల్స్‌లో భారత్ గెలుపొందటం కేవలం అదృష్టమేనని వ్రాసాయి బ్రిటిష్ పత్రికలు. ఫైనల్స్‌లో భారతజట్టు ఆడిన తీరు వారిని దిగ్భ్రాంతులను చేసింది. మన జయ్‌దుబాషీ గారేమో మరో మెట్టుపైకి వెళ్ళి అసలు భారత్ విజయమే ప్రమాదవశాత్తు జరిగినదని చెప్పేస్తున్నారు. భారతజట్టులో ఇంతకు ముందెన్నడూ లేనంత సమయస్ఫూర్తి ఈసారి కనిపించింది ప్రతి ఒక్క ఆటగాడు జట్టు విజయం కోసం కృషి సలిపారు.

జయ్‌దుబాషీగారు 'వైఫల్యమే మనకి ఇష్టమేమో' అని వ్యాఖ్యానించారు. అది అన్న వారికి చక్కగా వర్తిస్తుంది. భారత క్రికెట్ ఆటగాళ్ళకు మాత్రం అటువంటి భావం లేకపోవడం మన అదృష్టం.

బిర్లా గూర్చి, కల్పాక్కం రియాక్టర్ గూర్చి వ్రాయని పత్రికలది తప్పే. అంత మాత్రాన నెగిలిన విజయాలన్నీ 'ప్రమాదవశాత్తు' జరిగిన వనటం బాధాకరం.

శ్రీధర్ (కొత్తగూడెం)

[66వ పేజీ చూడండి]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

వాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 9–9–'83

రుధిరోద్గారి నామ సం. భాద్రపద శు. తదియ

**సంపుటము 75 సంచిక 54**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85 80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి అంబిక

(ఫొటో : ఎస్. ఆర్. డి. మూర్తి)



## లోకంపోకడ * ఊరిమెన్









# స్వరాజ్ పాల్ కి ఇంత డబ్బు ఎక్కడిది?




కొందరికి వంటబట్టనంత డబ్బు వస్తుంది. మరి కొందరికి వాళ్లకి వంటబట్టనంత రాజకీయాధికారం వస్తుంది. స్వరాజ్యపాల్ కి చాలా డబ్బు వచ్చినట్లు తెలుస్తూనే ఉంది. అంత ధనం అతని "వాణిజ్యపు ఆరోగ్యా"నికి మంచిదికాదు కాని ఆయన అలాగ అనుకోవటం లేదు. ఈమధ్యనే ఆయన ఈ ఊళ్లో ఒక సర్కస్ ప్రదర్శించారు. ఇక్కడేకాదు ఇతర బస్తీలలోకూడా—దానికి నేను వెళ్లాను. నాకేమని పించిందంటే, ఈయన ఉత్తి అమాయకుడు, ఆయన ఆయన స్నేహితులూ – పోషకులూ కలసి ఒక ఆట ఆడించారు (వీరిలో 1 సఫ్దర్ జంగ్ రోడ్ లో ఉండేవారూ ఉన్నారు) అని. అనతి కాలంలో ఆయనని వీళ్లందరూ వదిలేస్తారు. అబ్దుల్ రహమాన్ అంతులేని వదిలేసినట్లు. అబ్దుల్ రహమాన్ అంతూలేకికూడా ఆయనకి వంటబట్టనంత డబ్బూ, అధికారమూ వచ్చేశాయి. అందుకనే ఆయనని అలాగ వదిలేశారు.

స్వరాజ్ పాల్ వ్యాపారీకాదు, పారిశ్రామిక వేత్తాకాదు. ఆయన ఒక "వాణిజ్యపు జూదరి." అంటే, స్టాక్ ఎక్చ్చేంజిలలో షేరులు కొని అమ్మి డబ్బు చేసుకుంటాడన్నమాట. ఇది పాత జూదమే. పాల్ కన్నా పెద్ద పేరు ఉన్న వాళ్లే ఈ పనిచేసి బాగా సంపాదించారు. జాన్ కెన్నెడీ తండ్రి 1929 లో అమెరికాలోని షేరు మార్కెటు నాశనం కాకముందు షేరులని కొని అమ్మి బాగా డబ్బు చేసుకున్నాడు. ప్రస్తుతం బ్రిటన్ లో ఆర్థిక మాంద్యం తీవ్రంగా ఉందంటారు – అయినా సరే అక్కడ షేరులు కొని, అమ్మి కోటీశ్వరులయ్యే వాళ్లు ఎందరో ఉన్నారు. వీళ్లు కంపెనీ షేరులని చవకగా కొని– ప్రియంగా అమ్ముతూ ఉంటారన్నమాట. మూంధ్రా ఇటువంటి భారతీయ జూదరులలో ఒకడు. చివరికి జూదంలోనే కొట్టుకుపోయాడు అతను. పాల్ కీ అదే గతి పట్టగలదు. జూదగాళ్లెవరికీ ఎప్పుడు ఆగాలో తెలీదు కదా! ఈయనకీ ముంధ్రాకీ ఒక తేడా ఉంది. పాల్ వాడేది అవతల వాళ్ల ధనం, ముంధ్రా వాడింది బాంకులు ఇచ్చిన అప్పులు.

స్వరాజపాల్ నడిపే 'కపారో' సంస్థ జూదాన్ని కప్పిపుచ్చేందుకు వాడే ప్రదర్శన. జె.ఆర్.డి. టాటా అన్నట్లు ఇదొక అద్భుతమయిన యంత్రం. ఈ యంత్రం నల్లరంగు డబ్బుని తెల్లరంగు డబ్బుగా మారుస్తుంది. నల్లధనం ఏమిటి ఏ రంగు ధనాన్నయిన తెలుపు చెయ్యగలదు ఈ యంత్రం. కపారో సంస్థకి బ్రిటన్ లోని వేల్స్ ప్రాంతంలో ఒక ట్యూబు ఫ్యాక్టరీ ఉందిట. ఇది నిజమయిన ఫ్యాక్టరీకాదు. పాల్ చేసే పనులకి ఇదొక ముసుగువంటిది మాత్రమే. అమెరికాలోనూ పెద్దదొంగలు ఈ రకం ముసుగులు వాడుతూ ఉంటారు. ఆల్ కెపోన్ అనే పెద్ద బందిపోటు ముఠా నాయకుడు ఉండేవాడు. అతనికి చికాగో నిండా లాండరీలూ, పువ్వుల అంగళ్లూ ఉండేవి. ఇవేకాదు శవాలని పేటికలలో పెట్టి స్మశానాలకి పంపే వ్యాపారం కూడా అతనికి ఉండేది. ఈ వ్యాపారం అతనికి నిత్య జీవితంలో బాగా ఉపయోగపడి ఉండాలి. ఎందుకంటే అతనే ఎందరినో చంపించేవాడు.

చమురు లేదా పెట్రోలు ధరలు పదిరెట్ల దాకా పెరగటంతో ధనం సరాఫరా కూడ పది రెట్లు పెరిగింది. ఇంత డబ్బుని చూసి జనం వెర్రెత్తిపోయారు. అరబ్బులు లండన్ లో విపరీతంగా ఆస్తులు కొనటం ప్రారంభించారు. గిరాకీ విపరీతంగా పెరిగిపోయి అయిదు పడక గదుల ఇళ్ల ధరలు రు. 2 కోట్లు దాటిపోయాయి. బాంకులనిండా ధనమే! ఇలాంటి పరిస్థితులలో స్వరాజ్ పాల్ లాంటి వాళ్లకి బాంకుల దగ్గిర అప్పులు తీసుకోవటం, ఆ అప్పులతో తమాషాలు చెయ్యటం అంత కష్టమయిన పని కాకుండా పోయింది. జూదరులు కొందరు కోట్లు సంపాదించుకున్నారు. దీనంతటివలనా కొత్త సంపద ఏమయినా సృష్టి అయిందా అంటే అదీలేదు. ఉత్పత్తి ఎక్కువ అయిందా అంటే అదీలేదు. ఉద్యోగావకాశాలూ అధికం కాలేదు. ఎన్.కె.,యూ ఒక ఆర్థిక నిపుణుగా చెలామణీ అవుతున్నాడు. ఆయన అనుకుని ఉంటాడు "ఇంత డబ్బు ఉందికదా? మన చేతికి కొంత ఎందుకు అందదు?" అని. దేశానికి మంచిది, పెద్ద అధికారులకి మంచిది, రాజకీయ వాదులకి అసలే మంచిది– అని వాదించి వుండాలి మన ఆర్థిక నిపుణులు.

నిజం చెప్పాలంటే మనకి విదేశాలనుంచి ధనం అనవసరం! స్వరాజపాల్ నే తీసుకోండి. ఆయన ఎంత డబ్బు తేగలడూ? రు. 12 కోట్లా, 14 కోట్లా? ఇది మన విదేశమారకం వ్యాపారం లోటులో ఒక రోజుకి సరిపడినంత కూడా వుండదే? ప్రభుత్వానికి విదేశీమారకం రానే వస్తుంది. దానితో ఏమి చేస్తారు వాళ్లు? తటస్థ దేశాల శిఖరాగ్ర సమావేశాలూ, ఆసియాడ్ లూ జరుపుకుంటారు. స్వరాజపాల్ తీసుకువస్తే డబ్బు దేశంలోనే ఉండిపోతుంది, అనుకోండి. ఉండిపోతే ఎంతకాలం పనికివస్తుంది త. దే. శి. స. కీ. ఆసియాడ్ వేడుకలకీ? పది రోజులా?



ఇటీవల భారతదేశం వచ్చిన శ్రీలంక తమిళ ఐక్య విముక్తి సంఘటన నాయకుడు శ్రీ ఎ. అమృతలింగం. శ్రీలంకలో తమిళులపై జరుగుతున్న అన్యాయాలని ఆయన ప్రధాని శ్రీమతి గాంధీకి వివరించారు.

## కొత్త సంవత్సరంలో మీరింకా పాత కాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనే సరిపెట్టుకోవాలా?



కొత్త సంవత్సరం, కొత్త ఇల్లు, ఇంట్లోకి కొత్త పెళ్లికూతురు—ఇన్ని కొత్త శుభ సందర్భాల్లో ఎవరైనా పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ ఇష్టపడతారా? మీ ఇంటి గోడలకు వైనల్ వెయ్యండి. అవి ఎలా జీవంతో కళకళలాడతాయో చూడండి.

వైనల్ మీ గోడలకు నున్నటి ఫినిష్ ఇస్తుంది, ఖరీదైనవిగా కన్పించేలా చేస్తుంది—మునుపెన్నడూ లేనంతగా! వైనల్ వల్ల మరెన్నో ప్రత్యక్ష ప్రయోజనాలు కూడా—ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపరూ పోటీ పడలేనివి! ఇవన్నీ అదనపు ఖర్చేమీ లేకుండానే.

# బ్రిటిష్ పెయింట్స్ వైనల్ తెచ్చుకోండి మీ ఇంటి గోడల చేత ఉగాది శుభాకాంక్షలు పలికించండి

వైనల్‌ని ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనైనా పోల్చి చూడండి.
ప్రతి విషయంలోనూ అతి శ్రేష్ఠమైనది వైనల్.

| | వైనల్ | ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ |
|---|---|---|
| ఫినిష్ | చక్కటిది, నున్నటి | బాగుండదు |
| ఆరడానికి పట్టే సమయం | 4 గంటలు | 12 గంటలు |
| వాసన | ఇంపైనది | భరించలేనిది |
| కడుక్కోవేందుకు | ఎంతో వీలైనది | వీలుగా వుండదు |
| రంగు నిలిచి వుండటం | దివ్యం | పరవాలేదు |
| మన్నిక | ఎక్కువ | తక్కువ |
| వెయ్యడం | తేడా లేదు | |

.. అన్నిటికీ మించిన విషయం, 5 కిలోల ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కావలసివచ్చే విస్తీర్ణానికి, కేవలం 2 లీటర్ల వైనల్ చాలు!




# వైనల్

ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కన్నా అన్ని రకాలుగానూ మేలైనది.

British Paints
BERGER
WORLDWIDE

LINTAS(C)/VNL/73/2317 TL

# న్యూఢిల్లీ లేఖ

ఇదంతా ఇలాగే ఉండనివ్వండి. స్వరాజ్ పాల్ సాధిద్దామనుకుంటున్నదేమిటి దీనంతటివల్లా ? అంతూలేలాగే ఆయనా సమాజంలో గౌరవ స్థానం సంపాదించుకుందామనుకుంటున్నాడు. తాతా, బిర్లాలాగ "గొప్ప" వాడయిపోదామనుకుంటున్నాడు. అనుకుని తన ప్రయత్నాలు మొదలుపెట్టాడు. చివరికి జరిగిందేమిటి ? ఆయనని ఎవరూ అంతగా ఖాతరు చెయ్యటం లేదు. ఎందుకో పాల్‌కి అర్థంకాదు. పాల్ తీసుకువచ్చే డబ్బు నల్లడబ్బు, అంటారు తాతా సంస్థవారు. "ఆయనొక విదేశీవాడు కదా, ఆయన మనకి నీతులు చెప్పటమేమిటి ?" అంటారు బిర్లా సంస్థవారు. ఈయనకి పరిశ్రమని గురించి చాలా తక్కువ తెలుసు. ఈయన వచ్చి చేసేదేమిటి ? అంటాడు భరత్‌రామ్. వీళ్ళందరికీ పరిశ్రమలలోకి ఒక జూదరిని రానివ్వటం ఇష్టం లేదు. ఆయనికి గౌరవ మర్యాదలు ప్రసాదించటం వాళ్ళకి ఇష్టంలేదు. అంతూలే పదవిలో ఉంటేనే ఆతన్ని ఖాతరు చేస్తారు ఎవరయినా. అలాగే పాల్‌ని ఖాతరు చేసేవాళ్ళు ఆయన బలగంలో ఉండాలిసిందే. ఆయన బలగం ఒక సర్కస్ లాంటిది. ఆ సర్కస్‌లో ఏనుగలూ, ఎలుగుబంటులూ ఉంటాయి. వీటిని చుట్టూ పెట్టుకుని పాల్ నోటికి వచ్చిన వాళ్ళందరినీ తిడుతూ ఉంటాడు. తిట్లు తినేవాళ్ళలో జర్నలిస్టులూ ఉంటారు. వీళ్ళు ఆయన పార్టీలకి వెళ్లి వచ్చి ఆయననే తిడతారు. పాల్ నోటికి అడ్డులేదు. తాతా, బిర్లాలని కూడా తిడతాడు, రిజర్వు బాంకు గవర్నర్‌నీ తిడతాడు. కాని, స్వరాజపాల్ ప్రణబ్‌ముఖర్జీనీ తిట్టడు. ఎల్. కె. ఝూనీ తిట్టడు. ఎందుకో ఉహించడం కష్టం కాదు.

స్వరాజపాల్ చేసే పనినే శ్రీమతి గాంధీ కూడా చేస్తోంది. తన గౌరవ ప్రతిష్ఠలూ, తన కుమారుడి గౌరవప్రతిష్ఠలూ పెంచుకోవాలని ఆమె తాపత్రయం. తన ప్రభుత్వం యొక్క గౌరవాన్ని కూడా పెంచుకోవాలని ఆమె ఆశ. ఆశ ఉండటం తేలికే. దాన్ని నెరవేర్చుకోవటం ఎలాగ ? శ్రీమతి గాంధీకే లేని పరపతి పాల్‌కి ఉంటుందా ? ఆయన భుజం తట్టే ఫరవా లేదనే వాళ్లెవరు ? పాల్, అంతూలే లాంటి వాళ్ళు గౌరవప్రతిష్ఠలు లేని ఒక దొరతనం వారి సృష్టి. శ్రీమతి గాంధీ, స్వరాజపాల్, అంతూలే — వీరంతా ఒకే పడవలో ఉన్నారు. ఆది ఒక ఓటు పడవ. 

మార్కెట్లో గల

# వేరయిటీ

సంచికలో



- ద్రౌపది ఆరవ భర్తను నిజంగానే కోరిందా?
- బీరు తాగడం వల్ల కలిగే లాభాలు!
- జంతురతి సాధ్యమా?
- జుట్టు కోసిన దయ్యం!
- రేప్ తర్వాత ఆమె జీవితం!
- కలిగలా పై మరో సినిమా!
- ఆడవాళ్లకు సున్తీలట!
- దాంపత్యంలో ఎటువంటి ప్రేమ వుండాలి!
- అందాన్ని అమ్ముకుంటున్న అతివ!

మొదలైన 40 శీర్షికలూ, ఓ అంతర్జాతీయ నవలా, ఓ భారతీయ నవలతోపాటు అపూర్వమైన ఎన్నో వినూత్న రచనలు.



# నాకో నీడ కావాలి

కుందుర్తి ఇందిరాదేవి




"భానూ! భానూ!"

దొడ్లో తులసికోట ప్రక్కన, నవారు మంచంమీద, గుట్టుగా పడిఉన్న ఉతికిన బట్టల్ని మడతబెడుతున్న భాను తల త్రిప్పి చూచింది.

"భానూ శ్రీధర్ వచ్చాడమ్మా."

మడతబెడుతున్న చీరను ఉలిక్కిపడి వదిలేసింది భాను.

కళ్ళజోడు తీసి ఉత్తరీయంతో ముఖాన పట్టిన చెమటను తుడుచుకుంటూ "రేపు ఉదయం నిన్ను గుడివాడ తీసుకువెడతాడట" అంటున్న మేనమామవైపు విస్మయంగా చూడసాగింది.

"నువ్వు ఒకసారి పిల్లల్ని చూస్తే బావుంటుందని అన్నాడు."

"అదికాదు మామయ్యా! ఓ చెంప పదిహేను రోజుల్లో పెళ్ళి పెట్టుకుని, ఇప్పుడు..."

"అది నాకు తెలీదంటావా! పిల్లలుకూడా అమ్మను తీసుకురా డాడీ అని గొడవ చేస్తున్నారట..."

అంటున్న నారాయణరావుగారు ఆగిపోయారు.

చామన ఛాయగా, సన్నగా, పొడవుగా ఉన్న భానూ కళ్ళల్లో ఇంకా చెదిరిపోని విస్మయం! పెదవులమీద సన్నగా కదిలీ కదలని చిరునవ్వు

ఆయన కళ్ళల్లో ఒక్క క్షణం రెపరెలాడిన బాధావీచిక తెల్లమబ్బులా తేలిపోగా భానూ దగ్గరికి వెళ్ళి తలమీద చేయివేసి నిమురుతూ వాత్సల్యంగా అన్నారు.

"నీకు చాలా అన్యాయం జరిగిందమ్మా; మీ నాన్నకిచ్చిన మాటను నేను నిలుపుకోలేకపోయాను. చివరికి నిన్ను..." గొంతు బొంగురుపోయింది.

"మామయ్యా..." భానూ అస్పష్టంగా అంది.

"నీకు ఏ మార్గం చూపించకుండానే పోతానేమోనని ఎంత భయపడేవాడినో నీకు తెలీదు. శ్రీధర్ చాలా యోగ్యుడు. అతను ఇంజనీరని, ఆస్తిపరుడని ఆశపడి ఈ పెళ్ళి చెయ్యటంలేదమ్మా. కేవలం అతను బుద్ధిమంతుడనే రెండో పెళ్ళివాడైనా సిద్ధపడింది. ఇందాక అతనేమన్నాడో తెలుసా! 'ఒకసారి భానుని తీసుకెళ్ళి పిల్లల్ని చూపిస్తాను మాష్టారూ! భానుకి ఈ పెళ్ళి ఇష్టంలేకపోతే ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నాకు తెలిసిన కుర్రాడున్నాడు. వెళ్ళి మాట్లాడదాం' అన్నాడు. వాడంత నిజాయితీగా అడుగుతుంటే నాకు ఎంత సంతోషమేసిందో తెలుసా! నువ్వు సుఖపడతావనే నమ్మకం నాకు పూర్తిగా కలిగింది భానూ. నీకిక మంచిరోజులు వచ్చాయమ్మా. శ్రీధర్ నిన్ను పువ్వులమీద నడిపిస్తాడమ్మా."

నారాయణరావుగారు మితిమీరిన ఆనందంతో ఉద్వేగంగా అన్నారు. మేనకోడలి పట్ల ఆయన వాత్సల్యం ఎనలేనిది.

"నేను వెళ్ళి మీ అమ్మతోను, అత్తయ్యతోనూ చెప్పివస్తాను" అని ఇంట్లోకి వెళ్ళిపోయారు.

భాను ఆ బట్టలిక మడతబెట్టే ఓపికూడా లేనిదానిలా అమట్టునే మంచంమీద వాలిపోయింది.

ఇరవై సంవత్సరాల క్రితం, తండ్రిని కోల్పోయి, తల్లి కొంగు పట్టుకుని, అమాయకంగా మేనమామ ఇంట అడుగుపెట్టినప్పుడు 'ఇకనుండీ మనం ఇక్కడే ఉండాలి' అని తల్లి చెప్పగానే బిక్కముఖం పెట్టిన ఏడేళ్ళ భానూ, అప్పటినుండి ఇప్పటివరకూ అక్కడే ఉండిపోయింది.

సావిత్రి, భాను ఒక ఈడువాళ్ళు. ఒక్కడే కొడుకు శీను. తర్వాత వసంత, రాధ. వాళ్ళ చదువులు, ఆటపాటలు నిర్విఘ్నంగా కొంతకాలం సాగిపోయినయి. పిల్లలు ఎదుగుతున్నకొద్దీ ఆర్థిక చిక్కులు ప్రారంభమైనయి. అందులో ఆడపిల్లలు! ఇంత ఉన్నవాళ్ళు చకచకా ఎదిగి తోటకూరకాడల్లా పెరగటంతో, ప్రకృతిసిద్ధమైన మార్పులు, బట్టలు, చదువులతో నారాయణరావుగారు ఊపిరి త్రిప్పుకోలేకపోయారు. దానికి తోడు చాలీచాలని జీతాలు.

అన్నపూర్ణమ్మగారు భర్త తరఫున వచ్చిన

ఎకరం పొలంమీది అయివేజు ఇంటి క్రిందే వాడేస్తుంది. అయినా రోజు రోజుకీ చుక్కలంటుతున్న ధరల ముందు ఎంత ఆదాయం చాలేదికాదు.

ఇంట్లో ఏ చిన్న ఇబ్బంది వచ్చినా వీళ్ళే కారణం అన్నట్టు తల్లీకూతుళ్ళు కనిపిస్తారు.

శాశ్వితంగా ఇక్కడే ఉండిపోయిన తల్లీ, కూతుళ్ళను చూస్తుంటే రాజేశ్వరమ్మగారికి కోపం, విసుగు ఎక్కువ కాసాగినయి.

చాలదన్నట్టు రాయిలా తిరుగుతుండే అన్నపూర్ణమ్మగారు తరచూ అనారోగ్యానికి గురవుతోంది. "ఈ చాకిరీ అంతా చేయలేక ఛస్తున్నాను" అని రాజేశ్వరమ్మగారి గొంతు కూడా రోజు రోజుకి తారాస్థాయి నందుకుంటోంది.

ఫలితం! భాను చదువు ఆగిపోయింది. ఇంటి దగ్గిరే చదువుకుంటూ ఇంటి పనుల్లో చిన్న చిన్న సాయాలు చేస్తూ, క్రమేపీ ఇంటి పనంతా తన చేతుల్లో వదిలేస్తుంటే కిమ్మనకుండా చేసిందే తప్ప, నావల్లకాదు అని ఒక్క మాటయినా అనలేదు.

"అది ఒక్కతీ ఎంత చాకిరీ చేస్తుంది" అని నారాయణరావుగారు కేకలు వేస్తే పిల్లలు, ఆవిడ హడవిడిగా పై పనులు చక్కబెట్టి, ఆయనటు ముఖం త్రిప్పగానే ఇటు తోక ఝాడించేవాళ్ళు.

ఆ సంవత్సరం భాను టెన్త్ పరీక్ష పోయింది. "నీకు చదువబ్బదు, చావదు. ఇంటి పనులన్నా నేర్చుకో" అని రాజేశ్వరమ్మగారు చివాట్లేసింది.

స్కూల్లో చదివిన సావిత్రి ఫస్ట్ క్లాస్‌లో పాసయి గర్వంగా చూస్తుంటే భానూ ఏడ్చేసింది. తల్లి పెదవి విప్పి ఒక్క మాటయినా అనలేదు.

ఓదార్చింది ఒక్క మేనమామే. "ఈసారి బాగా చదువమ్మా భానూ" అని తల నిమిరి ఓదార్చారు.

తల మునిగే పనిలో ఉండే భానుకి క్రమేపీ చదువుమీద శ్రద్ధ కూడా తగ్గిపోయింది. అలసిపోయిన శరీరం విశ్రాంతి కోరేది కానీ చదువుకు సుముఖత చూపించేది కాదు.

పగలంతా పనిచేస్తూ, రాత్రి అన్నీ సర్దుకుని పక్క సర్దుతుండగానే నిద్ర ముంచుకొచ్చి గాఢంగా నిద్రపోతుండే మేనకోడలికి, చదువు చెప్పడానికి వచ్చే నారాయణరావుగారు గాఢంగా నిట్టూర్చి వెనుదిరిగేవారు.

ఆ విధంగా భానూ చదువు టెన్త్ కూడా పూర్తవకుండానే శాశ్వితంగా ఫుల్‌స్టాప్ పడిపోయింది.

ఇంట్లో ఏ ఒక్కరూ భానుకి సాయం చేసేవారు కాదు. గిలకలా తిరుగుతూ ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూండే భానుని చూస్తుంటే వాళ్ళకి ఎక్కడలేని బద్ధకమేసేది.

"భానూ ఈ బట్టలకు కాస్త సర్ఫ్ పెట్టవే, గంజిపెట్టి ఇస్త్రీ చెయ్యవే, ఈ పుస్తకాలకి కాస్త అట్టలు వెయ్యవే' అని పురమాయిస్తుండేవాళ్ళు.

టిప్‌టాప్‌గా తయారయి, పుస్తకాలు పుచ్చుకుని స్టైల్‌గా బయలుదేరేటప్పుడు టిఫిన్ బాక్స్‌లు కూడా భానూ సర్ది ఇవ్వాల్సిందే!

కూతురు ఆ విధంగా తీరికలేకుండా గృహకృత్యాల్లో మునిగిపోతుంటే, బెంగతో అన్నపూర్ణమ్మగారు కృంగిపోసాగింది.

డిగ్రీ అయిపోగానే మంచి సంబంధం కుదిరి సావిత్రి పెళ్ళయిపోయింది. ఏ మాటకామాటే చెప్పుకోవాలి! పిల్లలంతా చక్కటి కనుముక్కు తీరుతో తెల్లటిరంగు, పోలికలు పుణికిపుచ్చుకుని పుట్టారు. పైగా ఏమాత్రం కష్టపడకుండా ఆ అందానికి మెరుగులు దిద్దుకుంటూ నీట్‌గా ఉండేవాళ్ళేమో కళకళలాడుతుండేవారు.

నారాయణరావుగారు భానుకి మంచి సంబంధం తీసుకొచ్చారు. మంచి సంబంధమని ఆశపడ్డ రాజేశ్వరిగారు, కట్నం కూడా తక్కువే వసంతకి మాట్లాడమని పోట్లాడింది.

భానూ కన్నా చిన్నదైన వసంత పెళ్ళి చేయడమేమిటని ఆయన భార్యమీద విరుచుకు పడ్డారు. సావిత్రి కూడా తల్లికి వత్తాసు పలకటంతో ఆయన మండిపడ్డారు.

కానీ వచ్చిన వాళ్ళు కూడా చదువుకున్న పిల్లే కావాలనటంతో భానూ పెళ్ళి నారాయణరావుగారి అభీష్టానికి వ్యతిరేకంగా వాయిదాపడి వసంత పెళ్ళి జరిగిపోయింది. రెండు సంవత్సరాలు తిరిగిపోయినయి.

పట్టువదలని నారాయణరావుగారు తీవ్రంగా ప్రయత్నాలు చేస్తుండగానే అనుకోని సంఘటనలు జరిగి పోయినయి. హైదరాబాద్‌లో ఉద్యోగం వచ్చిన శీను పెద్దఎత్తున కట్నం పుచ్చుకుని పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయాడు. పద్దెనిమిదేళ్ళయినా నిండనిరాధ ఎవరినో ప్రేమించానని, పెళ్ళి చేసుకుంటానని మొండిపట్టు పట్టింది. దాంతో ఇంట్లో గాలిదుమారం రేగింది.

అది ప్రేమకన్నా, ఇంకాస్త ముందుకు పోయిందని భార్య నెత్తీ, నోరు కొట్టుకుంటుంటే గత్యంతరంలేని స్థితిలో రాధ పెళ్ళి చేశారు.

తన కళ్ళముందే సత్వర మార్పులు చెందుతున్న కుటుంబాన్ని చక్రంలో ఆకుల్లా గిర్రున తిరిగిపోతున్న రోజుల్నీ, నిశ్చేష్టురాలిలా, విభ్రమంగా చూస్తూండి పోయింది భాను.

ఇక కూతురికి ఈ జన్మకి పెళ్ళి అవుతుందా, లేదా అనే బెంగతో అన్నపూర్ణమ్మగారు మంచం పట్టేసింది. అంతటితో చాలదన్నట్టు ఆవిడకు పెరాలిసిస్ స్ట్రోక్ రావడంతో అసలే ఆర్థిక ఇబ్బందుల్లో పీకలదాకా మునిగిపోయిన నారాయణరావుగారు హతాసులయ్యారు.

ఆవిడ ఆశలు అడుగంటి పోయేలా, భానూ పెళ్ళికి ఆధారమైన ఆ ఒక్క ఎకరం పొలాన్ని అమ్మేశారు.

శీను భార్య ఎక్కడో ఒక ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం సంపాయించుకుని పిల్లల్ని ఇక్కడే వదిలేసింది. ఈ పనికి మటుకు రాజేశ్వరమ్మగారు తీవ్ర అభ్యంతరం తెలిపింది.

"ఆ మాత్రం నాకు తెలీదా. భానూ ఉందిగా. తను చూస్తుంది లెండి" అనేసింది.

ఎప్పుడూ, పురుళ్ళూ పుణ్యాలు అంటూ ఆడపిల్లలు వచ్చిపోతూనే ఉన్నారు. ఈ గొడ్డు చాకిరీతో, మృదుత్వం తగ్గిపోయి, సన్నగా టి.బి. పేషంట్‌లా ఉండి, వయసు కూడా దాటిపోయిన భానుకి పెళ్లి సంబంధం కుదరటం కూడా కష్టమైపోయింది.

ఇరుగమ్మకు, పొరుగమ్మకు ఏ సాయం కావాల్సి వచ్చినా నిస్సంకోచంగా చేసే భానూ, వాళ్ల సానుభూతినే కాక, వెటకారాల్ని కూడా మౌనంగా స్వీకరించేది.

పండగలకి పబ్బాలకి వచ్చిపోయే కూతుళ్లూ, అల్లుళ్లూ రాజేశ్వరమ్మగారి సంబరాన్ని తిలకిస్తూనే, భానుమీద సరదాగానో, కావాలనో ఏవేవో విసుర్లు విసురుతుంటే, భానూ మనస్సు అగాధాల్లోకి కృంగిపోయి "భగవాన్ నన్నిలా ఎందుకు పుట్టించావు తండ్రీ. నన్ను నీ దగ్గరకైనా చేర్చుకోరాదా" అని నిశ్శబ్దంగా రోదించేది.

మరుగుపడిన జ్ఞాపకాలను త్రవ్వుకుంటున్న భానూ చెంపల మీదికి వెచ్చటి కన్నీళ్లు జారిపోతున్నాయి.

ఆ అమాయక హృదయంలో చిన్ని కోరిక! బైటకి ఎవరికీ చెప్పుకోలేని అందమైన కోరిక!

తనకూ ఓ ఇల్లూ వాకిలీ కావాలి! తన కంటూ తనకో సంసారం కావాలి! నీకు నేనున్నాను అని ధైర్యంచెప్పే ఒక తోడు కావాలి. తనను సేదదీర్చే తనకంటూ తనకో నీడ కావాలి!

చిరుగాలికి అల్లల్లాడే పూల తీవెలా, తన జీవితం ఇంతకాలం ఈ కష్టాలనే పెనుగాలికి అల్లాడిపోయింది ఇప్పుడే ఈ పెనుగాలి తగ్గి స్థిరత్వం పొందుతోంది. కానీ అప్పటికే జీవితం అయిపోయింది. మోడువారిన జీవితంలోకి చిరుజల్లులా శ్రీధర్ ప్రవేశించాడు.

శ్రీధర్ జ్ఞాపకాలతో మనసులో ఏదో తీయటి ఊహ కలిగి, పెదవుల మీద చిరుదరహాసం కదిలింది. భాను చిత్తడి అయిన చెంపల్ని తుడిచేసుకుంటూ కళ్లల్లో నిశ్చింత తొంగిచూస్తుండగా పైకి చూసింది.

అంబరాన అక్కడక్కడా తొంగి చూస్తున్న తారలు చిలిపిగా నవ్వుతున్నాయి. సన్నని గాలికి తేలివస్తున్న పిట్టల కలకలం నిశ్శబ్దంగా ఉన్న పరిసరాల్లో మృదువుగా సాకుతోంది.

శిశిర ప్రభావంతో మోడువారిన చెట్లూ, చేమా ఆమని ఆగమనంతో క్రొత్త అందాలు

సంతరించుకుంటూ, పచ్చగా చిగుళ్లు వేసి కళకళ్లాడిపోతున్నాయి. మామిడి చివురులు తిని మత్తుగా గానంచేస్తున్న కోయిల స్వరం అద్భుతంగా ఉంది.

భానూ గుండెల్లో నిశ్చింత ఏర్పడినట్టు తేలికయి గండుకోయిల్లాంటి శ్రీధర్ స్వరం ధ్వనిస్తోంది.

ఈ పెళ్ళిప్రస్తావనకూడా చాలా చిత్రంగా, అనుకోకుండా వచ్చింది. నారాయణరావుగారు భానూ విషయంలో బాగా కృంగిపోయారు. చెల్లెలికి ముఖం చూపించడానిక్కూడా ఆయన సిగ్గుపడుతున్నారు. అనారోగ్యం నుండి ఆ రోజే కోలుకుని కులాసాగా కూర్చుని భానూ పెళ్ళి విషయం ఎవరితోనో మాట్లాడుతుండగా సావిత్రి దగ్గర్నుండి ఉత్తరం వచ్చింది.

అందులో సారాంశం ఇది. సావిత్రి అత్తవారికి బాగా సుస్తీగా ఉంటోందిట. పిల్లలతో చేసుకోలేకపోతున్నాను అని. అది వచ్చినదగ్గర్నుండీ రాజేశ్వరమ్మగారు హడావిడిపడుతూ ''బయల్దేరు. బయల్దేరు. నేను ఏదైనా ఊరగాయ సర్దుతాను. ఒట్టిచేతులూపుకుంటూ వెడితే ఏం బావుంటుంది. పిండివంట ఏదైనా చెయ్యి'' అని తను హైరానా పడుతూ, భానుని హైరానా పెట్టసాగింది.

అక్కడికి వెళ్లటం ఏమాత్రం ఇష్టంలేని

## నా నీడ కావాలి

భాను నిర్లిప్తంగా కూర్చుంది చీర చిరుగులు కుడుతూ.

''అలా రాయిలా కూర్చున్నావేమే. ఓ చెంప అది ఎంత కష్టపడుతుందోనని నాకు ఖంగారుగా ఉంటేనూ ...'' రాజేశ్వరమ్మగారు కోపంగా కేకలు వేసింది.

భానూ సమాధానం చెప్పలేదు. సావిత్రి భర్త ప్రవర్తన ఆమెకేమాత్రం నచ్చదు. ఏదో ఒక విసురు విసురుతూనే ఉంటాడు. ఓసారి సావిత్రి ఇంట్లో లేదు. ''భానూ ఇక నీకు పెళ్ళి అయ్యేయోగం కనిపించటంలేదు ఎటూ. నా దగ్గరే ఉండరాదు. ఈమధ్య పిల్లల గొడవల్లో సావిత్రి మరీ బిజీ అయిపోయింది. నా సంగతే పట్టించుకోవట్లేదు'' అన్నాడు.

భానుకి చెప్పలేని అసహ్యంవేసి ముఖం వాచేలా చివాట్లువేసి వచ్చేసింది.

భానూ తన మాట ఎంతమాత్రం లక్ష్యపెట్టకుండా తీరిగ్గా తన పని తను చేసుకుంటుంటే ఆగ్రహంతో విరుచుకు పడింది.

జన్మలో అత్తయ్యకి ఎదురుచెప్పని భాను చేస్తున్న పని ఆపి – ''నేను వెళ్ళనత్తయ్యా. అంతగా చేసుకోలేకపోతే పిల్లల్నే ఇక్కడికి పంపమను'' అంది.

ఆవిడ అవమానంతో దహించుకుపోతూ –

''ఏం దాని పిల్లలకు చదువ్వా, సంధ్యా అక్కర్లేదనుకున్నావా. వాళ్ళా నీలా గిన్నెలు తోముకుంటూ, వంట చేసుకుంటూ ఇంట్లో పడుండాలనా నీ ఉద్దేశం'' అంది.

భానూ ముఖం పాలిపోయింది. ఈలోపు అక్కడికి వచ్చిన నారాయణరావుగారు ఉగ్రులయ్యారా మాటలకు. ఇద్దరి మధ్యా చిలికి చిలికీ గాలివాన అయింది.

ఆయన ఆగ్రహంతో ''నీ పాడు బుద్ధితో దాని జీవితం నాశనం చేశావు కదే. దానికి పెళ్ళి సంబంధం కుదిరిస్తే తప్ప నేను ఇంటికిరాను'' అని ఇంట్లోంచి వెళ్ళిపోయారు.

రాత్రి ఆయన ఇంటికి రాకపోయేసరికి ఆవిడకు భయంవేసింది. తెల్లవారింది. ఆ రోజంతా కూడా ఆయన జాడతెలీలేదు. ఆవిడ ఏడుస్తూ తల్లీ కూతుళ్ళను దుమ్మెత్తిపోస్తునే ఉంది.

రెండో రోజు ఉదయం వికసించిన ముఖంతో ఆయన ఇంట్లోకి వస్తుంటే భానూ ఆయన్ని చుట్టేసి ఏడ్చేసింది.

''నీకు రాజాలాటి సంబంధం కుదిరిందే భానూ. లగ్నంకూడా పెట్టించుకువచ్చాను'' అన్నారు ఆనందంగా.

''ముప్పయి సంవత్సరాలు దాటిన దానికి మంచి సంబంధమేమిటో నా ముఖం'' అంటూ ఈసడించిందావిడ.






''అబ్బాయి ఇంజనీరు. అతనికి వైజాగ్ ట్రాన్స్‌ఫర్ అయ్యేట్టుందిట. కాకపోతే రెండో పెళ్ళివాడు. ఇద్దరు పిల్లలు.''

అని చెప్తుంటే రాజేశ్వరమ్మగారు 'హమ్మయ్య' అనుకుంది. 'ఎవరో ఒకరు' అని సరిపెట్టుకుంది అన్నపూర్ణమ్మగారు.

''విధివ్రాత'' భాను నిర్లిప్తంగా అనుకుంది.

అతను చిన్నప్పుడు ఆయన శిష్యుడట. తనంటే చాలా గౌరమట. భానుని చూడక పోయినా ఫర్వాలేదు. ముహూర్తాలు పెట్టించండి అన్నాడట. అసలతను భానుని ఎరుగున్నాడట.

ఆయన అప్పటికప్పుడు పిల్లలందరికి ఉత్తరాలు వ్రాసేశారు, ఇరవై రోజుల్లో భాను పెళ్ళని.

ఆ సాయంత్రం అతను వచ్చాడు. రెండో పెళ్ళివాడంటే ఎంత ముసలివాడో అనుకున్న వాళ్ళు తెల్లబోయారు.

శ్రీధర్ వయస్సు ముప్ఫయినాలుగు సంవత్సరాలయినా ముప్ఫయి ఏళ్ళవాడిలా అందంగా, ధృఢంగా ఉన్నాడు. దానికి తోడు మంచి పొడగరేమో హుందాగా ఉన్నాడు. అతన్ని ఈ క్షణాన మొదటిసారిగా పెళ్ళిచూపులకు పంపించినా ఏమీ అనుకోరు!

అన్నపూర్ణమ్మగారికి సంతోషం చెప్పనలవి కాదు. 'ఆ... ఎంతయినా రెండో పెళ్ళివాడే కదా.' అని రాజేశ్వరమ్మగారు సరిపెట్టుకుంది. బాగా ఆస్తిపరుడని ఆవిడకు ఓ మూల దుగ్ధగానే ఉంది.

భానూ ఆనందం అర్ణవమైంది. దానికి తోడు పైసా కట్నం లేదు. పెళ్ళి ఖర్చులన్నీ కూడా తనే భరిస్తున్నాడు.

ఎదుటి వ్యక్తి మంచి చెడ్డల్ని, ఇష్టాయిష్టాలను కూడా గమనించి గౌరవించే అతని వ్యక్తిత్వం భానుకి మరి మరీ నచ్చింది.

''ఏమిటమ్మా భానూ అలా పడుకున్నావు.''

మేనమామ తట్టి లేపటంతో భాను ఉలిక్కిపడి లేచింది. ఎప్పుడు చీకటి పడిందో గమనించనే లేదు.

ఎందుకో భాను రాత్రి చప్పున నిద్ర పట్టలేదు.

*     *     *

శ్రీధర్ ఉదయమే వచ్చి భానుని తీసుకుని గుడివాడ బయలుదేరాడు. ఒక్కదాన్నే పంపటమేమిటి అని రాజేశ్వరమ్మగారు బుగ్గలు నొక్కుకుంటుంటే నారాయణరావుగారు నోర్మూసుకోమని కసిరారు.

బస్సులో అతను భానూ ప్రక్కనే కూర్చున్నాడు. ఇద్దరూ పెదవివిప్పి అసలు మాట్లాడుకోలేదు.

శ్రీధర్ ఇంటికి వెళ్ళగానే భానుకి ఘన స్వాగతం లభించింది. శ్రీధర్ తల్లి ఆప్యాయంగా రెండు చేతులు చాచి దగ్గరికి తీసుకుంటుంటే భానూ ముందు తెల్లబోయింది.

శ్రీధర్ తమ్ముడు, అతని భార్యా ఆదరంగా ఆహ్వానించారు. అతని తండ్రి తాసిల్దారుగా చేసి రిటైరయ్యారు. భానూ వంగి ఆయనకు సమస్కరించింది.

''రా అక్కా'' అంటూ లక్ష్మి ఇంట్లోకి తీసికెళ్ళి ఇల్లంతా చూపించింది. ఆ ఇంటి వాతావరణమే చెప్తోంది వాళ్ళెంత స్థితిమంతులో. శ్రీధర్ కుతూహలంగా చూస్తున్నాడు.

పిల్లలు బైట ఎక్కడో ఆడుకుంటున్నారల్లేఉంది. శ్రీధర్ తీసుకురావడానికి వెళ్ళాడు.

లోపలి గదిలో ఒక స్త్రీ ఫోటోకి పూలదండ వేసి ఉంది. అందంగా ఉన్న ఆ స్త్రీని రెప్పవాల్చకుండా చూస్తున్న భానుతో లక్ష్మి విషాదంగా అంది

ఈ ఇంట్లో ఏ కలతలూ లేకుండా సుఖంగా ఉండటానికి మూలకారణం సుశీలక్కే. జబ్బుచేసి పోయింతర్వాత బావగారు ఈ పిల్లల్ని కూడా వదిలేసి ఒంటరిగా హైదరాబాద్ వెళ్ళిపోయారు. వారిది ఎంత అన్యోన్య దాంపత్యమో చెప్పనలవి కాదు.

అప్పుడప్పుడు పిల్లల్ని చూడటానికి వచ్చేవారు. డాడీ అమ్మేది అని పిల్లలు గొడవ చేస్తుంటే ''మీ అమ్మ హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తోంది. సెలవుల్లో తప్పకుండా వస్తుంది'' అని బుజ్జగించేవారు. అత్తగారి పట్టుదలతోనే బావగారు మళ్ళీ పెళ్ళికి సిద్ధమయ్యారు. పెద్ద బాబయితే రోజూ నన్ను ''పిన్నీ అమ్మ ఎప్పుడు వస్తుంది'' అని అడుగుతుంటాడు. 'సెలవు లివ్వగానే వస్తుంది' అని మరిపిస్తుంటాను.

లక్ష్మి చెమ్మగిలిన కనులు తుడుచుకుంటూ అంది. 'ఎంతకాలం మురిపించగలం. బాబుకి ఊహ వస్తోంది. ఈ ఫోటోలో మనిషే మీఅమ్మ అంటే చచ్చిపోయిందా అంటాడని భయం! మీ మామయ్యగారిచ్చిన ఫోటో చూపించి 'అమ్మ' అన్నప్పుడు వాడి చిన్న హృదయం ఎంత సంతోషపడిందో. ఇవన్నీ చెప్తున్నందుకు ఏమీ అనుకోకక్కా!''

భాను నోరు తెరిచి ఏదో అనేలోగానే బయట సందడి వినిపించింది. ''పిల్లలు వచ్చినట్టున్నారు రా అక్కా!'' లక్ష్మి ఆమె చెయ్యి పుచ్చుకుని, హాల్లోకి తీసుకువచ్చింది.

శ్రీధర్ చెరోచెయ్యి పుచ్చుకుని చూస్తున్న పిల్లల కళ్ళల్లో ఆశ్చర్యం, కుతూహలం తొంగి చూస్తున్నాయి. ఎవరీ కొత్త అమ్మ అనే సంభ్రమం!

''రవీ! అమ్మ వచ్చింది. ఇలారా'' లక్ష్మి పిలిచింది.

వాడికి సిగ్గేసిందిలా ఉంది. తండ్రి చాటున దాక్కుని తొంగి చూస్తున్నాడు. పిల్లల్ని ఆడించటం బాగా అలవాటయిన భానూ తనకు తెలియకుండానే రెండు చేతులూ చాచింది నవ్వుతూ.

రెండేళ్ళ చిన్ని పరిగెట్టుకొచ్చి చుట్టేశాడు. భానుకి హఠాత్తుగా ఏడుపు వచ్చేసింది. తన మెడను చుట్టేసినచిన్ని ''అమ్మా!అమ్మా!'' అని ఉత్సాహంగా అరుస్తుంటే గుండెలకు హత్తుకుంది. వాడిని చూసి రవి పరిగెత్తుకొచ్చి వెనకనుండి ''అమ్మా'' అని అరుస్తూ మెడ చుట్టూ చేతులు వేశాడు.

ఆ దృశ్యం చూస్తున్న అందరికళ్ళూ చెమ్మగిల్లాయి. కుతూహలంగా చూస్తున్న శ్రీధర్ గాఢంగా నిట్టూర్చాడు.

"అమ్మా! నీకు సెలవులిచ్చేశారా. ఈసారి మేంకూడా వస్తామమ్మా నీతో" రవి మారాం చేస్తున్నట్టుగా అన్నాడు.

చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకుంటూ అలాగే అన్నట్టు తలూపింది. లక్ష్మి కాఫీ తెచ్చింది. రవి భానూ వీపుమీద వాలి వెనక్కి ముందుకీ ఊగుతూ "పిన్నీ! ఆ బీరువాలో బట్టలన్నీ అమ్మవే అని చెప్పావుగా మా కిస్ ఇచ్చెయ్యి" అన్నాడు దబాయిస్తూ.

"హారి భడవా! ఎన్ని మాటలు నేర్చావురా" ముసలామె మురిసెంగా అంది. భోజనాలయ్యేంత వరకూ పిల్లలు అసలు వదిలిపెట్టలేదు. వాళ్ళ ఆటబొమ్మలు, క్లాసు పుస్తకాలు రవి అన్నీ చూపించాడు.

భానూ ఒక్క క్షణం తన వయసును కూడా మర్చిపోయి పిల్లల్లో కలిసిపోయింది.

"నీకు నచ్చిన బట్టలు నువ్వే వెళ్ళి ఎన్నిక చేసుకోమ్మా" అంది శ్రీధర్ తల్లి.

భానూ తెల్లబోయింది.

"ఇంకా పెళ్ళి బట్టలవీ కొనలేదక్కా. షాపింగ్‌కి వెడదాం" అంది లక్ష్మి.

జన్మలో ఎరగని ఆదరణ, పలకరింపు భానుని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

వారు ఐశ్వర్యవంతులే కాదు! సంస్కారం తెలిసినవారు! ఉన్నత మనస్కులు!

'భగవాన్! నన్నీవిధంగా కరుణించావా' భానూ మనసులోనే దేవుడికి అశేష నమస్కారాలు చేస్తోంది.

"బజారుకి మేమూ వస్తాము" అంటూ పిల్లలు కూడా వెంటబడ్డారు. మీకు మంచి బట్టలు తెస్తాము. చాక్లెట్లు తెస్తాము అని ఎలాగో మాయజేసి బయటపడ్డారు.

షాపింగ్ పూర్తయ్యేసరికి చీకటి పడిపోయింది. ఆ పాకెట్స్ అన్నీ తీసుకుని లక్ష్మి భర్తతో వెళ్ళిపోయింది. ఇద్దరూ బస్సులో విజయవాడ బయలుదేరారు.

"భానూ"

నిశ్చింతంగా ఏవో కలలు కంటున్నదానిలా కూర్చున్న భానూ ఉలిక్కిపడి చూసింది.

"ఇప్పుడు చెప్పు భానూ! నీ అభిప్రాయం"

"అభిప్రాయమా! దేనిగురించి" భాను విస్మయంగా అంది.

"పెళ్ళి గురించి"

"మామయ్య మీకేమీ చెప్పలేదా"

"చెప్పారనుకో. నువ్వు చూడకుండానే ఆయన నిశ్చయించారు. అందుకని"

"మీరూ నన్ను చూడకుండానే ఒప్పుకున్నారుగా"

## నాకో నీడ కావాలి

శ్రీధర్ చురుగ్గా చూసి నవ్వేస్తూ "నువ్వు చాలా తెలివైనదానివి భానూ. మాష్టారు నాకెలా కలిశారో తెలుసా" అన్నాడు.

భానూ కళ్ళు విప్పార్చి చూడసాగింది.

"మా తమ్ముడు మాత్రం ఎంతకాలం పిల్లల్ని చూస్తాడు. అందుకనే పెళ్ళి చేసుకోడానికే నిశ్చయించుకుని ఆ పని మీద విజయవాడ వచ్చాను. అనుకోకుండా మాష్టారు కనిపించారు. నువ్వు ఏమీ అనుకోకపోతే భానూ మాష్టారి పరిస్థితి నేను చూడలేకపోయాను. నా చిన్నతనంలో, డబ్బు, ఇంట్లో గారాబం నన్ను పాడు చేస్తున్న సమయంలో మాష్టారు ఒక్కరే నన్ను ఆపగలిగారు. ఆ కృతజ్ఞత నాకు జీవితాంతం ఉంటుంది. నేను నిన్ను చాలాసార్లు చూశాను కూడా. అందుకే నేను నిన్ను ఇష్టపడ్డాను" శ్రీధర్ తగ్గుస్వరంతో చెప్తున్న మాటలు వింటున్న భాను తల వాల్చుకుంది.

**మూయకు !**

ఎడారిలో తిరిగినా...
వెన్నెలలో విహరించినా...
మానవత్వం పెనవేసుకున్న
మనసు తలుపులు మూయకు...!
చీకటిలో చివికినా...
చింతలతో కరిగినా...
కాంతిరేకలు విచ్చుకున్న
కనురెప్పలు మూయకు...!!

— పి. కామేశ్వరరావు

"ఇప్పటికైనా మించిపోయింది లేదు భానూ 'ఇదే ముహూర్తానికి నీకు మంచి కుర్రాడితో వివాహ మయ్యేలా చేస్తాను" అన్నాడు.

అతను పిల్లల గురించి ఎంత భయపడుతున్నాడో ఆ మాటలే చెప్తున్నాయి. అయినాసరే అతనన్న తీరుకి భానుకి కోపం వచ్చేసింది.

"మీకు నా గురించి తెలుసుంటే నిజంగా మీరిలా అనరు. చిన్నప్పటి నుండి ఆ ఇంట్లో ఎలా బ్రతికానో నాకు తెలుసు. మా అత్తయ్య చేత చివాట్లు తినడంతోనూ, ఆవిడ పిల్లలకి సేవ చెయ్యటంతోటే గడిచిపోయింది జీవితం. ఎన్నిఅవమానాలు, ఎన్నితిట్లు, ఎన్నివెక్కిరింతలు! భగవాన్ పగవాడిక్కూడా ఈ బ్రతుకొద్దు అనిపించేది. నాకు లభ్యమవుతున్న ఆనందాన్ని చివరికి మీరు కూడా ..."

"ఆవేశపడకు భానూ. ఎవరి పిల్లల్నో పెంచాలంటే..."

"మీకా భయం వద్దు. నాకు ఇద్దరే పిల్లలని నాకు తెలుసు. ఇప్పటికి పదిసంవత్సరాల క్రితం అయితే ఏమో! చెప్పలేను. కానీ ఆవేశాలు, కలలు అన్నీ కరిగిపోయిన వయస్సు. ఇప్పుడు మా అత్తయ్య ధర్మమా అని శాంతం, ఆలోచనా అన్నీ స్థిరపడిపోయినయి. ఇందాక పిల్లలు చుట్టేసి "అమ్మా" అని అరుస్తుంటే నాకైతే ఏడుపొచ్చేసింది. ఇంత ఉన్నత హృదయుల ఇంట నాకు స్థానం ఇవ్వండి. పరాయి పంచల్లో బ్రతికిన నాకు పెళ్ళి ఒక అపురూపమైన కల అయిపోయింది. నాకు భోగభాగ్యాలు వద్దు, మేడలు, మిద్దెలు వద్దు. నాకంటూ 'నాకో నీడ కావాలి' అంతకు మినహా నేనేమీ కోరటంలేదు..." భానుకి ఉద్వతంగా దుఃఖం వచ్చేసింది.

శ్రీధర్ చెయ్యి ఓదార్పుగా భానూ భుజాల చుట్టూ పడి దగ్గరికి తీసుకుంది.

* * *

భానూ పెళ్ళి తిరుపతిలో జరిగిపోయింది. తల్లిదండ్రుల పెళ్ళి చిన్న పిల్లలు చూడకూడదని పిల్లల్ని తీసుకురాలేదు. ఇంటికి రాగానే పిల్లలు "అమ్మా" అని చుట్టేశారు.

"అబ్బా! మొత్తానికి మంచి మొగుడినే కొట్టేశావే, ముప్ఫయి సంవత్సరాలయినా" అంది సావిత్రి.

"బోలెడు డబ్బు. దేనికీ కష్టపడనక్కర్లేదు." అంది వసంత.

"ఇంజనీరంటే మాటలేమిటి." అక్కసుగా అంది రాధ.

"నీకు కష్టపడి పిల్లల్ని కనే బాధకూడా లేదు." అంది రాజేశ్వరమ్మగారు.

భానూ నవ్వుతూ అంది "నేను దేనికీ కష్టపడకూడదనేగాఅత్తయ్యా ఈపెళ్ళిచేశావు."

"అమ్మో! ఇన్ని మాటలెప్పుడు నేర్చావే.."

"భానూ" నారాయణరావుగారు వచ్చారు.

"శ్రీధర్ వైజాగ్ వెడతాడట. అక్కడ జాయినయి ఇల్లు చూసుకునివచ్చి తీసుకువెడతాడట మిమ్మల్ని" అన్నారు.

"అదేమిటి. అప్పుడే ఎలా పంపిస్తాము.."

అడ్డు పడబోతున్న భార్యను నోరు మూసుకోమని "స్టేషన్‌దాకా వెళతానమ్మా" అన్నారు.

భాను పిల్లల్ని తీసుకుని శ్రీధర్‌తో బయలుదేరింది.

"పిల్లల్ని నీదగ్గరే ఉంచుకుంటావా." అన్నాడు శ్రీధర్.

భాను నోరు విప్పకముందే పిల్లలు "మేము అమ్మదగ్గరే ఉంటాము" అన్నారు గట్టిగా.

"వెళ్ళగానే ఉత్తరం వ్రాయండి" అంది భాను.

"తప్పకుండా వ్రాస్తాను. వారం రోజుల్లో వస్తాను ఇల్లు చూసుకుని" శ్రీధర్ రైలు ఎక్కాడు. "టా! టా! డాడీ" పిల్లలు వీడ్కోలు చెప్పారు.

తన చెరో చెయ్యి పుచ్చుకుని, తండ్రికి చేతులూపుతున్న పిల్లలమధ్య నిలబడి, కళ్ళు చెమ్మగిల్లుతుంటే, చిరునవ్వుతో దూరమవుతున్న శ్రీధర్‌నే చూస్తుండిపోయింది భాను. ★



# శ్రీకృష్ణావతార వైశిష్ట్యం

"కరారవిందే పదారవిందమ్
ముఖారవిందే వినివేశయంతమ్
వటస్య పత్రస్య పుటేశయానమ్
బాలం ముకుందం మనసాస్మరామి."

దుష్ట శిక్షణ, శిష్ట రక్షణల నిమిత్తం భగవానుడు దివినుంచి భువికి దిగివచ్చిన పవిత్ర దినం శ్రీకృష్ణాష్టమి పర్వదినం. చిరంజీవి యయిన ఆ సర్వాంతర్యామి మానవ రూపుడై జన్మించిన వైనం పండిత పామర జనరంజకం. "అజోపి సన్నవ్యయాత్మ భూతానా మీశ్వరోపిసన్, ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా" అని చెప్పబడిన విధంగా భారతీయ పౌరాణికేతిహాసాలలో చెప్పబడిన ఇరవయ్యొక్క అవతారాలలో దశావతారాలు సుప్రసిద్ధాలు. అందులోనూ సంపూర్ణ సౌందర్యతత్త్వ సమన్విత మైనది శ్రీకృష్ణావతారమేనని బ్రహ్మవైవర్తాది పురాణాలు ప్రవచిస్తున్నాయి. శ్రీకృష్ణుడవతారం దాల్చింది మొదలు అంతంవరకు సాగించిన లీలా విలాసాలన్నీ 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్" అనే గీతా వాక్యార్థం దానికి విశిష్ట లక్ష్యాలై ప్రాజ్ఞులను దైవ మోహ భ్రాంతులను వేస్తాయి.

పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని జన్మకర్మలు దివ్యనవ్యాలు. ఇందులోని సత్యం గ్రహించినవారు జనన మరణ రాహిత్యమైన మోక్ష పదాన్ని అందుకొంటారని పరమాత్ముడే బ్రహ్మవైవర్త పురాణంలో యిలా అభి భాషించాడు.

"జన్మకర్మగమే దివ్యం ఏవంయోవేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామే తి సోర్జునః".

ఆధునిక కాలంలో అవతార భావనలే అపహాస్యంపాలై, ఆస్తికత్వ విచికిత్సకు అంత రాయాలు వస్తున్నాయి. కుహనా సన్న్యాసులపై వ్యక్తిపూజ ప్రబలిపోయి, పరమాత్మ భావనే లుప్తం అవుతున్నది. శ్రీకృష్ణావతార తత్త్వాన్ని ఎంత కొద్దిగా అవగతం చేసుకున్నప్పటికీ మన కందులో వ్యర్థత్వం కనిపించదు. ఉదాహరణకు, శ్రీకృష్ణుడు దుష్ట శిక్షణార్థం మధురానగరం ప్రవేశిస్తుంటే పలువురు పలువిధాలుగా ఆయనను భావించారట.

"గజత్రాతేది వృద్ధాభిః, శ్రీకాంత ఇతి యౌవతా, యధాస్థితశ్చ బాలాభిః దృష్టశ్శౌరిః సకౌతుకమ్" వృద్ధులకు గజేంద్రుని కాపాడిన మహాభాగునిగాను, బాలురకు యథాతథ స్వరూపునిగాను, కంస శిశుపాలాది నృశంసులకు జారచోర శిఖామణిగాను గోచరించటం యద్భావం తద్భవతి అన్నదానికి దృష్టాంతమే. మన ముఖాన్నిబట్టే అద్దం చూపుతుందన్న జవాబే భగవల్లీలలు విమర్శించేవారికి మనం చెప్పగలిగిన విషయం. శ్రీకృష్ణుడు చోరుడనీ, జారుడనీ కొందరు విమర్శిస్తారు. అట్టివాడు భగవంతు డేమిటని అపహసించేవారి అజ్ఞానానికి జాలి చూపించాలి. "జ్వ" అనే ధాతువునుంచే పుట్టిన జారశబ్దానికి నశింపు అని అర్థం "చురస్తేయే" అన్న ధాతువు నుండి పుట్టిన చోర శబ్దానికి భక్తుల మనస్సులను దొంగిలించువాడు, జార శబ్దానికి భక్తులలో వున్న అజ్ఞానాన్ని నశింప జేసేవాడు అన్న భావన చెప్పుకోవటం విజ్ఞులవిధి. దీనికి ఉపబలకంగా యజుర్వేదంలో, "తస్కరాణాం పతయేనమః" అన్న స్తుతి కూడ వున్నది. బాహ్య దృష్టితో శ్రీకృష్ణుడు మేనత్తయయిన రాధతో సంగమించాడు అనుకోవటం కూడ దుర్భ్రమయే. గోపికయైన రాధను మేనత్త యయిన రాధగా భ్రమించటం ఈ ఆలోచనా వైరుధ్యానికి హేతువు.

శ్రీకృష్ణుని గోపాలునిగా తక్కువగా భావించటం అవివేకం. అంతేగాకుండ గొల్ల యిల్లాండ్ర చీరలు దొంగిలించి వారికి మానభంగం గావించాడని దూషించటం అమానుషం. గోశబ్దానికి ఇంద్రియం అన్న అర్థం వుంది. దీని ప్రకారం భగవంతుడు ఎల్లప్పుడూ ప్రజల ఇంద్రియ పాలకుడై, వారు కట్టు తప్పకుండా కనిపెట్టుకొని వుంటాడనికి చెప్పుకోవాలి. అరిషడ్వర్గ (ఇంద్రియ) విజయమేగదా మనిషిని మనీషిని చేసేది? గోపికా వస్త్ర హర్త అవటంలో గూడ ఆయన వారి మాయావసనాలను హరించి, వారికి శరీర వ్యామోహం తొలగించాడని మహత్తర భావన. శ్రీకృష్ణుని అవతారతత్త్వ మహిమలైన వానిని మహా మనీషులైన భీష్మాచార్యులవంటివారే ఎరుగలేకపోయినారని భారత గ్రంథంలో చెప్పబడినప్పుడు, మిడిమిడి జ్ఞాన సంపన్నతలో భగవంతుని తత్వాన్నధిక్షేపించటం ఆత్మహత్యా సదృశం అని చెప్పక తప్పదు.

సర్వ వేదోపనిషత్సారభూతమైన భగవద్గీత, భాగవత పురాణశ్రవణం నిరంతం హృదంతరాల్లో పదిలపరచుకొంటేనే శ్రీకృష్ణావతారవైశిష్ట్యం కొంతవరకైనా సుగమం అవుతుంది. జగతిలో ధర్మరాజ్య సంస్థాపనార్థం శ్రీకృష్ణభగవానుడు గావించిన లీలావిలాసాలు నాన్యతో దర్శనీయాలు, ఆ జగన్నాటక సూత్రధారియైన శ్రీకృష్ణుని జన్మాష్టమి హైందవులకే కాకుండ ధర్మాసక్తి గల ప్రపంచ ప్రజలకందరకూ పర్వదినమే. తరాలు మారినా, యుగాలు మారినా సార్వజనీన సందేశాలిచ్చే శ్రీకృష్ణుని జీవనప్రస్థానాలు మన హృదయాల్లో చిరంజీవంగానే వుండిపోతాయి. అందుకోసం పంచ భూతాత్మకమైన యీ ప్రపంచంలో మనం చేసే ప్రతి అర్చనా ఆయనే అందుకొని మనల్ని జగత్కల్యాణకాముకులుగాచేసి చరితార్థుడవుతాడు శ్రీకృష్ణభగవానుడు.

"ఆకాశాత్పతితమ్ తోయమ్
యధా గచ్ఛతి సాగరమ్
సర్వ దేవ నమస్కారమ్
కేశవమ్ ప్రతిగచ్ఛతి."

—"సుచంద్ర" *



సీరియల్



# జీవనమురళి

## కొండముది శ్రీరామచంద్రమూర్తి

### 8

( గత సంచిక తరువాయి )

వీధిలో ఎవరికంటా పడకుండా మురళీకృష్ణ ఎట్లా ఇంటి వరకూ రాగలిగాడో అతనికే తెలీదు. దీపాల వెలుగును అతను తప్పించుకున్నాడు, చీకటి ముద్దల్లో అతను తల దాచుకున్నాడు. మండుతున్న మొహం, రగులుతున్న హృదయం, కట్టేసిన హస్తద్వయం, అతను నడకే నడిచాడో, పరుగే పెట్టాడో చూచిన వాళ్లెవరూ లేరు.

మురళీకృష్ణ ఇంటికి వచ్చేసరికి అదృష్టవశాత్తూ తలుపులు రెండూ తీసి వున్నాయి. వర్ధనమ్మ వంట పనిలో వుంది. పరమేశ్వరం దొడ్లో జూకా పందిరి మల్లెకింద మంచం వేసుకు పడుకున్నాడు. జీవన వీధి తలుపుల నానుకుని దూరంగా వినువీధిలో కనిపిస్తున్న తారలకేసి ఆలోచనా నేత్రాలతో పరికిస్తోంది.

"వచ్చారా ? ... అబ్బ ... ఇంతాలస్యమైందేం ?..." ఆ కంఠంలో ఎంతటి ఉద్విగ్నత, ఆ ప్రశ్నలో ఎంత ఆర్ద్రత ! ! ఆమె ఇంకా అతని మొహం వేపు చూడలేదు. అతను మొహాన్ని కిందకు దించుకుని వున్నాడు.

మురళీకృష్ణ అవతలవేపుకుతిరిగి అడిగాడు "బామ్మ ఎక్కడుంది ?"

"ఎక్కడుంటుందీ ? ... ఇంతసేపూ మీ కోసం ఎదురుచూసి, ఎదురుచూసి, తనను తాను నాలుగు తిట్టుకుని ఇప్పుడే వంటింట్లోకి వెళ్లింది ! "

ఆ తిట్లలో అన్యాపదేశంగా తనకు తగిలిన వాటిని గూర్చి జీవన ప్రస్తావన చెయ్యలేదు.

"నాన్న... ?"

"దొడ్లో పడుకున్నారు."

అప్పుడు చూసింది జీవన అతన్ని. కెవ్వుమన బోయింది. ఆ నోటికి తన నుదురు నానించాడు, ఆమె శబ్దం ఆమెలోనే వుండిపోయింది.

"ముందు నువ్వు లోపలకు పద—బామ్మకు నన్ను చూపించకుండా, నాన్న లేవకుండా..." మునిగాళ్ల మీద మురళీకృష్ణ చప్పుడు కాకుండా నడిచాడు గదిలోకి. అతనికీ వంటింటికి మధ్య జీవన అడ్డుగా నడిచింది. గదిలో నిలువుటద్దం ముందు నిలబడి మురళీకృష్ణ అన్నాడు "ముందీ కట్లు విప్పు... ! "

జీవన మౌనంగా కట్లు విప్పింది. అతని చేతులు విదిలించుకున్నాడు. పైకి కిందికీ ఝాడించాడు. "బామ్మకు తెలీకుండా కాసినినీళ్ళు తీసుకురాగలవా ?"

జీవన మరబొమ్మలా తలూపింది. ఆమెకు గుండె దుఃఖంతో బ్రద్దలయేట్టుంది. తను అడుగు పెట్టిన వేళావిశేషమేమిటో, పరమేశ్వరం గారికి పదవి పోయింది. మురళీకృష్ణకు దెబ్బలు తగిలి, అతను — ఆపదలు పాలయ్యాడు. జీవన బలవంతాన కన్నీళ్లను ఆపుకున్నది. "వేన్నీళ్లా ?" అని అడిగింది.

"వేణ్ణీళ్లు తీసుకు రాగలిగితే మంచిదే, కానీ బామ్మకు డౌట్ వస్తుంది. ఆరాలూ, ఆర్భాటాలూ, ఏడుపులూ, మొత్తుకోళ్ళూ, ఇంకొకరికి తెలియడాలూ నాకిష్టం లేదు."

"మీరుండండి, నేను తీసుకు వస్తాను కదా !" జీవన గది గుమ్మం తలుపుల్ని దగ్గరికి లాగి వంటింట్లోకి నడిచింది.

"ఎవరితోనమ్మాయ్ మాట్లాడుతున్నావ్?" బామ్మ అడగనే అడిగింది.

"ఎవరితోనూ లేదండి !"

"మరేవో మాటలు వినిపించాయ్ ?"

"అవా ? నాలో నేనే ఓ పుస్తకం పెద్దగా చదువుకున్నానండీ — ఏం తోచకపోతేనూ ..."

"సరేలే ... ఇట్లా వచ్చావేం ?"

"కాసిని వేణ్ణీళ్లు కావాలండి !"

"ఎందుకూ ?"

**జరిగిన కథ — 5 :** మురళీకృష్ణ, ఇంద్రసేన్, పాటల మాలచ్చి ఒకే రైల్లో ప్రయాణం చేసి దిగవలసిన స్టేషన్లో దిగుతారు. ఆ స్టేషన్‌లో తప్పించుకొని పారిపోయిన తన కూతురుని వెతుకుతూ ఒక పిల్ల తండ్రి, అతని అల్లుడు మురళీకృష్ణకు తటస్థపడతారు. తన తండ్రిని, బామ్మను తలచుకుంటూ ఆనందపురం పోవడానికై స్టేషన్ బయటికి వస్తాడు మురళీకృష్ణ. ఆనందపురం వెళ్లే దారిలో దొంగతనంగా ఒక లారీలో ఎక్కుతాడు మురళీకృష్ణ. అదే లారీలో దొంగతనంగా ప్రయాణం చేస్తున్న పెళ్లి కూతురు వేషంలో ఉన్న జీవనను చూస్తాడు. చంద్రనగర్‌కు పొలిమేరల్లో ఆగిన లారీనుంచి బయటపడ్తారు మురళీ, జీవన. జీవన, మురళీకృష్ణ జీవన మేనమామ ఇల్లు చేరుకుంటారు. అక్కడ జీవనకు సరైన రక్షణ లభించదని తెలుసుకున్న మురళీకృష్ణ ఆమెను తన ఇంటికే తీసుకెళతాడు. జీవన మురళీకృష్ణ తండ్రి, బామ్మల ఆదరాభిమానాలను పొందుతుంది. జీవనను తీసుకొని బట్టలకొట్టు కెళతాడు మురళీకృష్ణ. అక్కడ ఆమె ఇంద్రసేన్ బహూకరించిన ఖరీదయిన చీరని తిరస్కరిస్తుంది. పురాతన శిధిలాలు చూసి ఇల్లు చేరుతారు. ఇంద్రసేన్ పరమేశ్వరంగారిని సర్వీసునుంచి సస్పెండు చేస్తాడు. ఆయన స్కూలులో జరిగిన విషయాలనీ కుటుంబ సభ్యులతో చెపుతారు. తన తండ్రికి జరిగిన అవమానం విన్న మురళీకృష్ణ కోపంతో ఇంద్రసేన్ ఇంటికి వెళ్లి, తన తండ్రిని సస్పెండ్ చేయడానికి గల రీజన్స్ చెప్పమని అడుగుతాడు. ఇంద్రసేన్ సరైన కారణాలు చెప్పలేకపోతాడు. నాగలింగం పెట్టిన షరతులు విన్న మురళీకృష్ణ ఆవేశానికి లోనవుతాడు. ఇంద్రసేన్ తన మనుష్యులచేత మురళీకృష్ణను బయటకు గెంటిస్తాడు.

"నీరసంగా వుంది, కాస్త హార్లిక్స్ కలుపు కుందామని !!"

"అయ్యయ్యో అట్లాగా, కలుపుకో అమ్మా !— ఇదిగో క్షణంలో పెట్టేస్తాను !"

ఆమె వేణ్ణీళ్లు ఇవ్వగానే జీవన వాటిని వో పాత్రలో వొంపుకుని, గదిలోకి వచ్చేసింది. ఆ నీళ్ళలో తన దగ్గరవున్న యాంటీ సెప్టిక్ లోషన్ కొద్దిగా కలిపాడు మురళీకృష్ణ. దూది కోసం అటూయిటూ చూశాడు. అతని భావన జీవనకు అర్థమైపోయింది.

"మీరు ముందట్లా మంచం మీద పడుకోండి !"

"ఎందుకూ ?"

"పడుకోండి చెబుతాను!" ఆమె బలవంతం చేసింది. అతను పడుకున్న తర్వాత, తలకింద దిండ్లను సరిచేసింది. చొక్కా గుండీలు విప్పి ఫానుగాలి అతనికి తగిలేట్లుగా ఫాన్ను అతనివైపు తిప్పింది. తన దగ్గరవున్న హేండ్‌ల్యూమ్ చేతి రుమాలును లోషను కలిపిన నీళ్ళలో తడిపి, అతనికి మొహం మీద తగిలిన దెబ్బల నుండి కారిన నెత్తురును, గడ్డకట్టుకుపోయి నల్లగా కనిపిస్తున్న చారికలను, అత్యంత జాగరూకతతో తుడిచింది. వేణ్ణీళ్ళతో అతని మొహాన్ని, చేతుల మీదా, మోకాళ్ళమీదా తుడిచి శుభ్రం చేసిం తర్వాత, "మందేమన్నా వుందా?" అని అడిగింది బాష్పరుద్ధ కంఠంతో. అంతవరకూ ఏకాగ్రతతో ఆమె చేస్తున్న సేవలనూ, సేవల్లో నిమగ్నమైన ఆమె వదనాన్ని చూస్తున్న మురళీకృష్ణ ఆమె విచలిత కంఠాన్ని వినగానే ఉలిక్కిపడి, "మందా? అక్కరలేదు !" అన్నాడు.

"ఎందుకనీ ?"

"నీ చేతులు తగిలాయిగా !— అందుకని."

ఆమె చెంపలు అరుణారిమ రాగరక్తిమతో మోహనంగా భాసించాయి. అంతలోనే తనను తాను నిగ్రహించుకుంటూ, కుహనా కోపం నటిస్తూ, "హాస్యాలు తరువాత, ముందు ఏం మందు వేయాలో చెప్పండి. ఇంట్లో వుందా, పోయి తీసుకురానా ?" అని అడిగింది.

"ఇప్పుడు నువ్వేమీ తీసుకు రానక్కరలేదు' బామ్మకోసం ఇంట్లో ఎప్పుడూ ప్రిక్లీ హీట్ పౌడర్ డబ్బా వుంటుంది. ఎందుకైనా మంచిదని నాన్న బోరిక్ పౌడరో డబ్బా అట్టేపెడతాడా గూట్లో. ఆ రెండూ తెచ్చి కలిపి దూగారగా రాయి, చాలు."

జీవన ఆతను చెప్పినట్లే చేసింది. అతని గాయాలకు పౌడరు రాసింతర్వాత డబ్బాలు తీసేసుకుని లేచి అవతలకు వెళ్ళబోయింది. అతనామెను వెళ్ళనీయకుండా తనమీదకు వంగి వున్న ఆమె బుజాలమీద రెండు చేతులూ వేసి "కూచుందూ !" అన్నాడు ఆర్ద్రంగా.

ఆమె లేవబోయిందల్లా కూచుంది.

"ఊఁ! ఇప్పుడు చెప్పండి, ఏంజరిగిందో?"

"ఏముందీ -- అసలు కారణం ఏవిటో కనుక్కుందామని ఆ ఇంద్రసేన్ ఇంటికి వెళ్ళాను!"

"అక్కడేదో గొడవ పడి వుంటారు అయ్యవారు, పెళ్ళివేసి పంపించారు !"

"గొడవంటూ ప్రత్యేకం ఏం జరగలేదు జీవనా ! ఆ వ్యవస్థ లక్షణమే అంత ! తమ అధికారాన్నీ, అలవాట్లను, ఆచారాలను మరొకరు సవాలు చేయడాన్ని వాళ్ళు పీసమెత్తుకూడా సహించలేరు. పరాభవానికి తట్టుకోలేరు. హింసలో కాని వాళ్ళకు ఆత్మసంతృప్తి లభించదు" అంటూ పూసగుచ్చినట్టు జరిగిందంతా చెప్పాడు. అతను చివరి అక్షరం చెప్పడం ముగించాడో లేదో, అంతవరకూ గుమ్మం ఆవతల గోడ చాటున నిలబడి అంతా విన్న వర్ధనమ్మ, పరమేశ్వరం "అయ్యో! అయ్యో!" అంటూ కంగారు పడుతూ లోపలకు వచ్చేరు.

వర్ధనమ్మ అతని దెబ్బలన్నీ తడుముతూ, కన్నీరు పెట్టుకుంటూ, ఇంద్రసేన్‌కు శాపనార్థాలు పెట్టసాగింది. "వ్యవహారాలేమైనా వుంటే కాయితాలమీద. తేల్చుకోవాలిగాని, ఇదేం పద్ధతి ? పశువుల్లాగాను !" అంటూ తిట్టిపోయ సాగింది.

పరమేశ్వరం కొడుకువేపే నిశ్చలంగా చూస్తున్నాడు. అతని కళ్ళల్లో నీళ్ళు నిండి కొడుకును సరిగా చూడనీయక తెరలు కడుతున్నాయి. "మన రోజులు బావున్నయ్ నాయనా ! ఇంతకన్నా మరేం ఘోరం జరగలేదు !" అన్నాడు చివరకు.

"ఇప్పుడేం జరిగిందని మీరంతా ఇంత బాధపడుతున్నారు ? డబ్బు, మనుషులూ, స్థానబలమూ తనవి గనుక అతనిది పైచెయ్యి అయింది. సంగతి సందర్భాలు కనుక్కుందామనుకున్నాను. కనుక్కున్నాను. వాళ్ళ స్వభావాలు తెలుసుకుందామనుకున్నాను, తెలుసుకున్నాను !" అన్నాడు మురళీకృష్ణ లేచి కూచోటానికి ప్రయత్నం చేస్తూ.

మళ్ళీ మాట మారుస్తూ, "ఇదంతా మీకు తెలీకుండా వుంచాలనీ, తెలిస్తే మీరు బాధ పడతారనీ, అనుకునే జీవనతో కాస్త సీక్రెట్‌గా వుంచవే మహాతల్లీ అన్నాను. మిమ్మల్ని తీసుకొచ్చి,



## జీ వ న ము ర ళి

గోడవతల నిలబెట్టేసి, నాచేత కథంతా చెప్పించేసి ఈ నాటకం ఆడేసింది" అన్నాడు నిష్ఠూరంగా.

"అబ్బెబ్బే — లేదండీ ! — నేనేం నాటకం ఆడలేదు. మావయ్యగారితోనూ, మీ బామ్మ గార్తోనూ అసలు నేనేం చెప్పలేదు." జీవన కంగారుపడింది.

"నువ్వు వేణ్నీళ్ళడిగినప్పుడే నా కనుమానం వేసిందే పిల్లా ! నీ వెనకాతలే వచ్చా, నీ కంగారులో నువ్వు చూడలేదు. మనవణ్ని చూడగానే గదిలోకి వచ్చేద్దామనే అనుకున్నాను. మీ ఇద్దరి భాగోతమూ కొంత విన్న తర్వాత, అబ్బాయిని తీసుకొచ్చా !" అన్నది వర్ధనమ్మ ముఖాన్ని గంటుపెట్టుకుంటూ.

"భాగోతం ఏముందండీ ఇందులో?" జీవన అభిమానం దెబ్బతింది ఆ మాటతో.

"భాగోతం కాక మరేవిటీ ? వాడు దెబ్బల పాలై, నెత్తురోడుతూ ఇంటికొస్తే, పెద్ద ప్రాణాలం ఇద్దరం వున్నామే ఇంట్లో, మాకు తెలీకండా. ఈ నాటకాలేవిటీ ? వాడంటే కుర్ర సన్నాసి. వయసులోవున్న ఆడపిల్లవి నీకన్నా తెలియనక్కరలేదూ, ఏది ఉచితమో, ఏది కాదో!"

"అమ్మా... !" పరమేశ్వరం ఆమె వాక్ప్రవాహాన్ని అడ్డుకోబోయాడు

"ఒరే అబ్బాయా, కాస్సేపు నువ్వు కలగజేసుకోబోకు. తెలతెలవారుతూండగా ఈ అమ్మాయొచ్చింది, తెల్లవారేసరికి నీ కుద్యోగం ఊరమ్మైంది. చీకటి పడేసరికి నీ కొడుక్కు ప్రాణాలమీదకు వచ్చింది. ఒక్కొక్కరొచ్చిన వేళావిశేషం అటువంటుదీ—మనమేం చేస్తాంలే !! సరే వచ్చింది — బాగానే వుంది, అబ్బాయికి మనం దగ్గిరా, తనా ? వాడు చెప్పమన్నాడు కదా అని నాతో అబద్ధాలు చెబుతుందా? పరేలే, ఆ పిల్లను అనే హక్కు నాకెక్కడదీ? చుట్టపు చూపుగా వచ్చింది. చుట్టంగానే వెళ్ళిపోతుంది. అయితే ఒకటి మాత్రం నిజం, ఇటువంటిపనులు నాకిష్టంలేవు !"

అనవలసినవి నాలుగూ అని విసవిసా వర్ధనమ్మ లోపలకు వెళ్ళిపోయింది.

జీవన మధ్యమధ్యలో కల్పించుకుని తన వైపు వాదం వినిపించబోయింది. వద్దంటూ సంజ్ఞచేశాడు మురళీకృష్ణ. ఆమె మానుకుంది అయిష్టంగా, బాధగా.

వర్ధనమ్మ అవతలకు వెళ్ళిపోయింతర్వాత గాఢంగా నిట్టూరుస్తూ అన్నాడు —

"ఎప్పుడు మారుతుందిరా మీ బామ్మ ?"

"ఇంక మారుతుంది ?" మురళీకృష్ణ కోపంగా అన్నాడు. తన మాటలకు అర్థాలేవిటో తనకే తెలీదు !"

పరమేశ్వరం జీవనవేపు చూడలేకపోయాడు. వెయ్యి లంకణాలు చేసినట్టుగా ఆ పిల్ల మొహం

పీక్కుపోయింది. "అతిథి మనసు గాయపెట్టి అమ్మ తప్పుచేసింది." అనేసి చివాలున లేచి లోపలకు వెళ్ళిపోయాడు.

వర్ధనమ్మకు తన మనసులోని మాటలు నాలుగూ అనేసిన తర్వాత మనసెంతో తేలిగ్గా వుందనిపించింది. నాలుగు నిముషాల్లో మూడు కంచాలూ పెట్టేసి "రండర్రా — భోజనాలకు." అని పెద్దగా కేకేసింది.

"పద జీవనా !"

"మీరు భోంచేసి రండి. నా కాకలిగాలేదు!"

"ప్లీజ్ !" మురళీకృష్ణ బతిమలాడ బోయాడు.

"బలవంతపెట్టి నన్నెందుకు బాధ పెడతారు ? దయచేసి కాస్సేపు నన్ను వొంటరిగా వదిలేద్దురూ, మీకు పుణ్యం వుంటుంది." జీవన దాదాపు కన్నీళ్ళతో అన్నది.

"నేనూ బాధపడుతున్నాను జీవనా, నా గాయాలకు, ఆమె మాటలకు !" అతను వంటింట్లోకి వచ్చి పీటమీద కూచున్నాడు. పరమేశ్వరం మౌనంగా అన్నం కలుపుకున్నాడు.

"ఏదిరా నీ స్నేహితురాలు ?" వర్ధనమ్మ అడిగింది.

"ఆకలిగా లేదుట, తర్వాత తింటుందట!"

"కోపం వచ్చింది గామోసు ! అయినా నేనేం అన్నాను తప్పుమాట ?— అబ్బాయికి ఉద్యోగం పోవడం అబద్ధమా ?"

తింటూ తింటూ వుంటున్న వాడల్లా మురళీకృష్ణ ఎంగిలిచేత్తోనే పీటమీది నుండి లేచి హాల్లోకి వెళ్ళి, చొక్కాజేబులో నుండి చెక్కు తీసుకుని, ఎడంచేత్తో దాన్ని పట్టుకుని విసురుగా మళ్ళీ వంటింట్లోకి వచ్చాడు.

"ఇందాక ఆ ఎమోషన్‌లో చెప్పడం మర్చి పోయాను బామ్మా! నాన్నకు ఉద్యోగం పోయింది కదా, ఈ సందర్భంలో మనింటికి లక్ష్మీ అమ్మవారు నడిచొచ్చింది. ఇటు చూడు, ఇది యాభైవేల రూపాయలు బామ్మా — యాభై వేలు !!"

"యాభైవేలే ?!" వర్ధనమ్మ దవడలు నొక్కుకుంది.

"నాన్నా ! మీ పెన్షను, గ్రాట్యుయిటీ, ప్రావిడెండ్ ఫండు ఇవన్నీ లెక్కకట్టి ఏక మొత్తంగా ఇచ్చేస్తున్నానన్నాడు ఆ ఇంద్రసేన్. మామూలుగా అయితే ఇందులో ఒక్కొక్కటీ రావడానికి ఒక్కొక్క సంవత్సరం తక్కువ కాకుండా పడుతుంది — మూడూ కలిపి ముచ్చటగా మూడేమూడు క్షణాల్లో పరిష్కారం చేసేశాడు. బామ్మా ! నాన్న వచ్చే సంవత్సరమో, పై సంవత్సరమో రిటైరుకాక తప్పదు కదా, కాస్త ముందుగానే రిటైరయ్యాడనుకుందాం. యాభైవేలు చేతిలో కొస్తుంటే మనకేం ?" అన్నాడు ఆ చెక్కును రెపరెపలాడిస్తూ.

పరమేశ్వరం కొడుకువేపు వింతగా చూశాడు. మురళీకృష్ణేనా ఈ మాటలు మాట్లాడు తున్నది అనిపించింది.

"బామ్మా, ఈ యాభైవేలూ పెట్టి ఏం చేద్దామంటావ్ ?"

నాకేం తెలుసురా, ముసిలిదాన్ని, నువ్వూ మీ నాన్నా కలసి ఏది మంచిదనుకుంటే ఆ పని చేయండి !"

"అది కాదే, వంటిల్లూ, పూజగదీ ఒకటే అయిపోయి నువ్వు నాన్నా ఇబ్బంది పడిపోతు న్నావు — పూజ గది వేరుగా కట్టించుకుంటే బావుండదూ ? ముక్కు మూసుకుని దేవుడి ముందు ఎంతసేపు కూచున్నా మన ధ్యానానికి భంగం వుండదు !"

"నిజమేరా నా పూజకో గది ప్రత్యేకం వుంటే బానే వుంటుందిరా !"

"అంతేకాదు బామ్మా, రేపు చెక్కును డబ్బుగా మార్చంగానే నీకూ, నాన్నకూ రెండు ఎయిర్‌కండిషన్డ్ ఫస్ట్‌క్లాస్ టిక్కట్లు కాశీకి కొని తీసుకువస్తానే !"

"అదేమిట్రోయ్, మా ఇద్దర్నీ ఇప్పట్నుంచే వదిలించేసుకుందామని చూస్తున్నావేమిటి ?" వర్ధనమ్మ మొహం సంతోషంతో వెలిగిపోతోంది. యాభైవేలంటే మాటలా మరి !

"వదిలించుకోడం కాదే ! గంగలో స్నానం చేసుకుంటూ నువ్వూ నాన్నా కాశీ, ప్రయాగ, హరిద్వార్, హృషీకేష్ తిరిగి వస్తారని ! మీరు అవన్నీ చూసుకుని ఇంటికి తిరిగొచ్చేసరికి, ఇక్కడ కొత్త పూజగది కళ కళ లాడుతూ నీకు స్వాగతం చెబుతుంది. ఆ గదిలో రాముడూ, కృష్ణుడూ, శివుడూ తమ తమ పీఠాల మీద కూచుని నీ పూజల కోసం ఎదురు చూస్తుంటారు !"

ఆనందంతో వర్ధనమ్మ హృదయం పూర్ణ సంద్రమే అయింది. ఆమె కళ్ల ముందు గంగా నదీ, ఎత్తైన హిమాలయ పర్వత పంక్తులూ, భక్తుల ప్రార్థనలూ సాక్షాత్కరించడం మొదలెట్టాయి. కొత్త పూజా మందిరంలో అగరువత్తుల దీపాలూ, ఆవునేతి దీపాలూ, ఏకాగ్రమైన ధ్యానమూ ఆమెకు కనిపిస్తున్నాయి.

"పోనీలే నాయనా, ఇన్నాళ్ళికి నా కలలు ఫలించబోతున్నాయ్. ఆ గంగలో స్నానం చేసి విశ్వేశ్వరుడికో నమస్కారం చేసుకువస్తే, ఈ జన్మకో సార్థకత ! "

"బామ్మా ! నా దృష్టిలో నిజంగా ఇది మంచిరోజేనే ! "

"ఎవరు కాదంటార్రా ! ఆ బంగారు గజ్జెల తల్లి తనంత తాను మనింటికి నడిచి వచ్చింది కద్రుటా ?"

"ఆ బంగారు గజ్జెల తల్లి వస్తున్నాదని చెప్పడానికన్నట్లుగా ముందుగా జీవన వచ్చిందేమో నని నా సందేహమే !"

"అయివుండొచ్చు !" వర్ధనమ్మ తల వూపింది.

పరమేశ్వరం అన్నంతినడం ఎప్పుడో అయి పోయింది. తనను కన్న తల్లికీ, తను గన్న వాడికీ మధ్య శ్రవణ సాక్షిగా కూచున్నాడు. మురళీకృష్ణ అంతరంగం అర్థమై తనలో తనే తృప్తిగా నవ్వుకున్నాడు.

"ఉండొచ్చు అని కాదు బామ్మా, నువ్వు స్పష్టంగా చెప్పాలి. ఇందాక ఆ అమ్మాయి అడుగు పెట్టడంవలనే మనకీరోజు ఈ కష్టాలు వచ్చాయన్నావ్. ఇప్పుడేమో ఈ అదృష్టానికీ










ఆమే కారణం అంటున్నావ్. నాకీ డొంక తిరుగుళ్ళు తెలీవు. నువ్వూ, నాన్నా ఏం చెబితే అదే నాకు వేదం. నాన్నా! నువ్వు చెప్పు!''

''అమ్మ చెబుతుంది లేరా, ఆవిడకన్నా నాకు మాత్రం ఏం తెలుసు ?'' పరమేశ్వరం కొంచెంతెతనమూ మురళీకృష్ణకు అర్థమై పోయింది.

''బామ్మా, నువ్వు చెప్పేసెయ్యవే, ఏది నిజమో! ఆ అమ్మాయి అడుగు పెట్టడం మంచిది కాకపోతే, వెంటనే పంపించేస్తాను. పెద్దమ్మనునెత్తినెవరు కూచోబెట్టుకుంటారే?''

''అట్లా అనకురా! పెళ్లికాని పిల్లను పట్టుకుని పెద్దమ్మ, గిద్దమ్మ అనకూడదురా తండ్రీ! కన్నెపిల్లలందరూ రాజరాజేశ్వరీ అవతారాలు. ఆ అమ్మాయి ముగ్గుపెట్టగానే వచ్చిందంటే, అందులో అంతరార్థం వుండేవుంటుంది. నేను కనుక్కోలేకపోయాను.''

''అయితే ఏవిటంటావ్—?'' మురళీకృష్ణ విసుగు నటించాడు.

''ఆ అమ్మాయి లక్ష్మిదేవిరా! అదృష్ట లక్ష్మి !!''

''ఆహా! లక్ష్మిదేవ్! ఆమెగారు జేష్టా దేవిలా ఏడుస్తూ ఆ గదిలో కూచుంది. అన్నం తింటానికి రమ్మంటే రాను పొమ్మంది, ఆకలి లేదంది. పాలే తాగుతుందో, మజ్జిగే తాగుతుందో, నాకేం తెలీదు, ఆమెగార్ని నువ్వెట్లా సముదాయిస్తావో ?''

''ఆ సంగతి నాకొదిలిపెట్టరా! నువ్వు బాధపడతావెందుకూ ?'' అంటూ వర్ధనమ్మ చిక్కగావున్న మజ్జిగను వో పెద్ద గ్లాసులో పోసుకుని, అందులో ఓ చెంచాడు పంచదార కలిపి జీవనవున్న గది దగ్గరకు బయల్దేరబోయింది.

''నువ్వెందుకే ఆ ఉపచారాలు చేయడం ? ముందు నువ్వన్నం తిను!'' మురళీకృష్ణ ఆమెను అకవారించాడు.

''ఇంట్లో ఓ కన్నెపిల్ల అభోజనంగా పడుకుంటే, నా కొచ్చిన తొందరేవిటా ?'' అంటూ ఆమె తన మనవడి మాటను లెక్కపెట్టనట్లుగా ముందుకు నడిచి జీవన గది ముందు నిలబడి ''జీవనా'' అంటూ కేక వేసింది.

జవాబులేదు. మళ్ళీ మళ్ళీ పిలిచింది. ఓరవాకిలిగా వేసివున్న తలుపులు వేసినట్లే వున్నాయి. జీవన వున్నట్లా? లేదా? ఉంటే ఎందుకు మాటాడదు ?

''ఏమమ్మా పలకవు, పులకవు ?'' అంటూ తలుపు రెక్కలు తెరిచింది వర్ధనమ్మ. ఖాళీ గది బోసిగా పరిహసించింది. వర్ధనమ్మకు గుండె దడదడలాడింది. చేతనున్న మజ్జిగ గ్లాసు వణికింది. ''ఒరే కృష్ణా! అమ్మాయి కనిపించడం లేదురా!'' అంటూ కీచుగా, భయంగా అరిచింది.

## నిద్రమాత్రల అలవాటు!

పశ్చిమ జర్మనీలోని వయోజనులలో ప్రతి పది మందిలో ఒకరు కనీసం వారానికి ఒక రోజు నిద్రమాత్రలు ఉపయోగిస్తారని ఒక సర్వేలో తేలింది. పురుషుల కంటే స్త్రీలలోనె ఈ అలవాటు ఎక్కువగా ఉంటున్నది. పురుషులలో నిద్రమాత్రలు ఉపయోగించేవారు ఆరుశాతం ఉండగా, స్త్రీలలో 13 శాతం ఉన్నారు. వయసు పెరిగేకొద్దీ ఈ తేడా మరీ ఎక్కువగా ఉన్నది. 45 — 59 సంవత్సరాల వయోజనులలో పురుషులలో10శాతం, స్త్రీలలో 14 శాతం ఉన్నారు. 60 సంవత్సరాలు నిండిన వారిలో పురుషులలో 14 శాతం, స్త్రీలలో 28 శాతం నిద్రమాత్రలు ఉపయోగిస్తున్నారు. కొంత మంది వృద్ధ మహిళలు ప్రతినిత్యం నిద్రమాత్రలు ఉపయోగిస్తున్నారు. ఒంటరి తనంలో బాధపడే వారిలో ఈ అలవాటు ఎక్కువగా ఉన్నది.



ఆ అరుపు విని మురళీకృష్ణ ముందుగా పరుగెత్తుకుని అక్కడకు వచ్చాడు.

''ఏమిటే బామ్మా ?'' అంటూ. తడబడుతున్నఅడుగులతో ఆ తరవాత పరమేశ్వరం వచ్చాడు ''ఏమైందే అమ్మా ?'' అనుకొంటూ.

''జీవన లేదురా ఇక్కడ ?''

మురళీకృష్ణ మనసు కీడును శంకిస్తోంది. మంచంమీద తనుకొన్న చీరల పెట్టెవుంది. జీవన కట్టుకున్న కొత్తచీర పొగుపడివుంది మంచం చివర. బట్టల స్టాండుమీద ఆమె కట్టుకువచ్చిన పెళ్ళి పట్టుచీర లేదు. దిండు కింద వో ఉత్తరం వుంది.

ఆ ఉత్తరాన్ని వణికే చేతులతో తీసుకున్నాడు.

''బిడ్డొచ్చినవేళా గొడ్డొచ్చినవేళా అన్నది బామ్మగారు. ఎవరి కాలు ఎటువంటిదో అంటూ భయపడిపోతోందామె. ఇహ ముందేం అవుతుందో అనుకొంటోంది ఆమె ముసలి గుండె. మనిద్దరిదీ ఓ భాగోతం అనుకొంటోందామె. నాటకాల మనిషిగా నన్ను భావిస్తోంది. ఉచితానుచితాలు తెలియని వయసులో వున్న ఆడపిల్లగా నన్ను నిందారోపణకు గురిచేసింది. చుట్టపు చూపుగా వచ్చిన దానిని, చుట్టంగానే వెళ్ళిపోవాలన్న సూచన చేసింది. నిజమే! ఎక్కడో ఎగురుతున్న చిలకమ్మను. గూటినుంచి పారిపోతున్న అభాగినిని! ఓ గోరింక చేరదీసింది. అయితే చేరుకున్నచోట అంతా చీకటిగావుంది. అందుకే ఆ చిలక ఎగిరిపోతోంది ఎక్కడికి ?

ఎక్కడికో !!" ఆ ఉత్తరం వ్రాస్తున్నప్పుడు కన్నీటి చుక్కలు పడ్డట్లు కొన్ని అక్షరాలు చెరిగిపోయాయి. ఆ ఉత్తరం చదువుతున్నప్పుడు మరి కొన్ని చుక్కలుపడి మరో ఇన్ని అక్షరాలు చెరిగాయి. 'జీవనా !' అంటూ మురళీకృష్ణ వాకిలివేపుకు పరుగెత్తాడు. కన్ను ఆనినంత మేరా కళ్ళు చికిలింతలు చేసుకుని చూశాడు.

వెన్నెల పుచ్చపువ్వులా వుంది. రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. ఏ ఇంట్లోనుండో వో జోలపాట వినిపిస్తోంది సన్నగా, మనోహరంగా.

దూరంగా ఓ ఆడమనిషి వెన్నెల తీగలా నడిచిపోతూ వీధి చివర కనిపించింది. 'జీవనా !' అంటూ కేకపెట్టి పరుగెట్టబోయాడు. అట్లా పరుగెట్టబోయిన మనమణ్ణి జబ్బ పట్టుకుని ఆపింది. "ఆగరా ! వెర్రివాడా ! ఆ పిల్లమనసు బాధపెట్టింది నేను ! అర్థం చేసుకొనేట్టు చేసి ఆహ్వానించి తీసుకురావలసింది నేను !!" అన్నది జబర్దస్తీగా వర్ధనమ్మ. అడుగులు దూరాన్ని చప్పరించాయి. ఆమె ఊహలు జీవన గమనాన్ని అడ్డగించాయి. ఆమె క్షణాల్లో జీవనను కలుసుకుంది. జీవన త్వరత్వరగా నడవబోయిందికానీ ఆమెను చెయ్యిపట్టుకు ఆపేసింది వర్ధనమ్మ. "ఇంత రాత్రివేళ, ఇంట్లో చెప్పా పెట్టకుండా ఎక్కడికని బయల్దేరావ్ జీవనా ?" జీవన తడబడింది, మాటల్లో, అడుగుల్లో. "పద. పద. వెనక్కు. నీ కోసం కృష్ణ కలవరిస్తున్నాడు."

"నేను ... !" ఏదో అనబోయింది జీవన.

"పిచ్చిదానా! నువ్వు మా బంగారు లక్ష్మివి! ముసలిముండ గుండెనర్థం చేసుకోలేకపోయిన వెర్రితల్లివి!" జీవన చెయ్యిపట్టుకుని వర్ధనమ్మ వెనక్కు తీసుకువచ్చింది.

## 9

కొద్ది రోజుల్లోనే మురళీకృష్ణ కుటుంబంలో ఓ ముఖ్యమైన వ్యక్తి అయిపోయింది జీవన. ఎవరూ లేవకముందే, తొలికోడి కూత విన్న కొంతసేపటికి నిద్రలేస్తుంది. కాల్యకృత్యాలు తీర్చుకొన్న తర్వాత ఆవు దగ్గరా, తులసికోట దగ్గరా బాగుచేసి, స్నానం చేసి, తడి తలతోనే దొడ్లో పూసిన పూలను కోసుకువచ్చి, దేముడు ముందుంచి — క్రిందటి రోజు నిర్మాల్యం శుభ్రం చేసి — పూజ ప్రారంభం చేస్తుంది. ఆ పూజ చివరలో విధిగా ఓ ఆధ్యాత్మ రామాయణ కీర్తన వుంటుంది. కీర్తన వింటూ వర్ధనమ్మ నిద్ర లేస్తుంది. అవసర నైవేద్యం గంట వింటూ పరమేశ్వరం నిద్ర లేస్తాడు. దీపారాధన సమయానికి మురళీకృష్ణ లేచి వస్తాడు.

కాఫీ జీవన కలిపి ఇవ్వాలి.

స్నానానికి నీళ్ళు జీవన తొలపాలి.

పాలు కాచి జీవన తోడెట్టాలి.

# జీవన మురళి

ఏపూట ఏకూర ఎట్లా వండితే రుచి ఎక్కువౌతుందో జీవనకు తెలుసు. ఇల్లు ఏవిధంగా సర్దితే ఎక్కువ అందంగా కనిపిస్తుందో జీవనకు తెలుసు.

"జీవనా ! రామదాసు కీర్తనేమన్నా నీ కొచ్చా !" పాడమని వర్ధనమ్మ బతిమాలింపు.

"నా రుద్రాక్ష తావళం కనపడటం లేదమ్మా !" వెతికిపెట్టమని పరమేశ్వరం అర్థింపు.

"షైరు కెళ్దాం రమ్మంటే రావేం ?" మురళీకృష్ణ దబాయింపు.

అందరికీ ఆమె తలలోని నాలుక అయిపోయింది. ఆమె లేకుండా క్షణం కూడా వుండలేని స్థితికి చేరుకున్నారు వారు.

"ఏమండీ— ఆ చెక్కుమార్చి, బామ్మగారికి రైలు టిక్కట్టు కొని..." అన్నది జీవన ఒకనాటి ఉదయం కాఫీ సమయంలో, అన్నమాట విలువ కోరేం అన్నది హెచ్చరికగా.

**సాగర సంగమం**

జీవితం —
ఒక మహాప్రవాహం !
పరుగులు తీస్తుంది
ఉరకలు వేస్తుంది
వరదలై ఉప్పొంగి
ప్రళయాన్ని సృష్టిస్తుంది !!
ఎంత చేసినా తుదకు
కాలసాగర గర్భంలో
విలీనమైపోతుంది !!!

— దొడ్డంకి వెంకట్రావ్

"జీవనా ! మా బామ్మ కాశీయాత్ర, జీవన — కోసం మాన్పడానికి ఆడిన నాటకం !" అన్నాడు మురళీకృష్ణ నిర్మలంగా నవ్వుతూ.

"అదేమిటి ?"

"నువ్వు బాధ పడుతున్నావని తెలుసుకున్నాము. నీకా బాధ తగ్గాలంటే, కోపం పోవాలంటే, బామ్మ ప్రసన్నం కావాలి. బామ్మ చేతనే నువ్వు మంచిదాని వనిపించాలి !"

"అమ్మదొంగా !"

"ఈ లోపల నువ్వు తొందరపడ్డావ్, గడపదాటావ్. ఇవాళ నేనే వచ్చి నిన్ను క్షమార్పణ కోరి ఇంటికి తీసుకు వద్దామనుకున్నాను. మా బామ్మ నాకన్నా పెద్ద మనసు కలిగింది. తానే తన ఉదారతను చూపించింది. నిన్ను తనే ఈ ఇంటికి స్వయంగా ఆహ్వానించింది."

"అయితే ఈ నాటకంలో మామ్మగారి కాశీయాత్ర గంగలో కలిసిపోయినట్లేనా ?"

"ఆహా !"

"చెక్కు మార్చుకోవడం...!

"అదీ అంతే !"

"అయితే డబ్బు తెచ్చుకోరా ?"

"చెక్కు మారిస్తే మా నాన్న డిస్మిసల్‌ని ఒప్పుకొన్నట్టే ! ఇంద్రసేన్ దౌర్జన్యాన్ని ఆమోదించినట్లే ! అది జరగడానికి వీల్లేదు !"

"మీరు చెక్కు మార్చినా మార్చకపోయినా, దేవుడి గది మాత్రం వేరే కట్టించక తప్పదు, మామ్మగార్ని కాశీకి పంపకా తప్పదు !"

"చూద్దాం !"

"చూద్దాం!" అన్న ఆ రోజు సాయంకాలం పరమేశ్వరమూ, మురళీకృష్ణ స్కూలుకు వెళ్ళారు.

"మాష్టారొచ్చారు !" అంటూ పిల్లలు చుట్టూ మూగారు. క్లాసుల్లో జరుగుతూ జరుగుతూ వున్న పాఠాలు ఆగిపోయాయి. చెబుతూ చెబుతూవున్న పాఠాల్ని ఆపేసి టీచర్లు బయటకు వచ్చారు

"వ్హాట్ హేపెన్డ్ ?" అంటూ ఏక్‌దిన్‌కా సుల్తాన్‌కా వున్న ఇన్‌ఛార్జి హెడ్‌మాష్టరు లెక్కల అసిస్టెంటు గిరీశం ఇదివరకు పరమేశ్వరం కూచునివుండే గదిలోనుండి గోచీ సవరించుకుంటూ బయటకు వచ్చాడు.

"ఒహోహో ! తమరా — ఏమిటలా దయచేశారూ ? దయచేయండి, దయచేయండి" అంటూ చేదుమింగిన మొహంపెట్టి వాళ్ళిద్దర్నీ లోపలకు తీసుకువెళ్ళాడు.

రెండు మూడు వారాల వ్యవధిలోనే స్కూలు వాతావరణమంతా ఎంతో మారిపోయినట్లు స్పష్టంగా కనిపిస్తోంది. గోడమీదవున్న బాపూజీ పటంలేదు. ఆ స్థానంలో ఇందిరాగాంధీ, సంజయ్ గాంధీ, రాజీవ్‌గాంధీల ఫొటోలున్నాయి.

"మీకో సెండాఫ్ పార్టీ అన్నా ఏర్పాటు చేయలేకపోయాం !" అన్నాడు విచారంగా టీచర్స్ యూనియన్ సెక్రటరీ పరంధామయ్య.

"డిస్మిస్ అయిపోయినారుకదా, డిస్మిస్డ్ పర్సన్‌కు సెండాఫ్ ఇస్తే ఏం బావుంటుంది ?" అన్నాడు ఇన్‌ఛార్జ్ హెచ్. యం.

'ఇప్పుడు ఆ విషయమే తమతోమాట్లాడుదామని వచ్చాను !'! అన్నాడు పరమేశ్వరం.

"నాతోనా ?"

"మీతోనూ, టీచర్స్‌తోనూ!... ఆ తర్వాత స్టూడెంట్స్‌నందర్నీ ఓసారి కలుసుకుని...!"

"మీటింగులూ గట్రా ఏం ఎరేంజ్ చెయ్యొద్దని ప్రెసిడెంట్‌గారి ఆర్డరండీ !" గిరీశం నీళ్ళు నమిలాడు.

"మేము హెచ్. యం. గార్ని కలుసుకు తీరతాం. వారు చెప్పింది విని తీరతాం. వారి దగ్గరకు మేం వెళ్ళలేదు సరే, మా దగ్గరికి వారు వచ్చినప్పుడైనా మేం వారిని గౌరవించ లేకపోతే, మా కన్నా పిరికివాళ్ళూ, నేరస్థులూ మరొకరుండరు !" పరంధామయ్య శషభిషలు లేకుండా అన్నాడు.

# ధర్మపథం

**బులుసు వేంకటరమణయ్య**

## రుద్రాక్ష పిల్లులు

పంచతంత్రంలోని ఒక కథను అనుసరించి యీ సామెత ఏర్పడింది. ఒక చెట్టు మీద కనిపిస్తున్న పక్షులు, తమ పిల్లల రక్షణ కోసం ఒక ముసలి గ్రద్దను నియమించి, తాము తెచ్చిన ఆహారంలో కొంత దానికిస్తూ ఉండేవి. ఆ గ్రద్దకు కన్నులు కానరావు. అయినా పక్షి పిల్లలను జాగ్రత్తగా చూసుకునేది. ఒకనాడు ఆ పక్షి పిల్లలను తినడానికి



ఒక పిల్లి ఆ చెట్టుమీదకి వచ్చేసరికి గ్రద్ద కనబడింది. పక్షి పిల్లలు పిల్లిని చూచి అరచాయి. గ్రద్ద "ఎవ్వరు నువ్వు?" అని బెదిరించగా 'తాను పిల్లిననీ, అయినా శాకాహారిననీ, ధర్మాలు తెలిసికోడానికి తమ వద్దకు వచ్చాననీ, రుద్రాక్షలు తిప్పుతూ జపం చేసుకొని కాలం గడుపుతున్నాననీ చెప్పి నమ్మించి, పరిచయం చేసుకుని వస్తూపోతూ ఆ పక్షిపిల్లల్ని తింటూ వుండేది. ఆ గ్రద్దయే వాటిని తింటున్నదని తలచి, పక్షులా గ్రద్దను పొడిచి చంపివేశాయి. ఇదీ, రుద్రాక్ష పిల్లి కథ!

ఇలాంటి రుద్రాక్ష పిల్లులు మానవులలో కూడా ఉంటారు. స్వార్థపరులై, అమాయకులుగా ఉన్నట్లు నటించి, తమ మంచినే చూసుకుంటూ నమ్మినవారికి ముప్పు తెచ్చిపెడుతూ ఉంటారు.

కర్మాగారాల్లో పనిచేస్తూ వున్నవారి అభ్యుదయానికి అన్నివిధాలా కృషి చేస్తామనీ, అవసరమయితే యజమానులతో పోరాడి, వారు లొంగిపోయి, కార్మికుల కోరికలను సమగ్రంగా నెరవేర్చేటట్టు చేస్తామనీ నాయకులు కొందరు ప్రతి నెలా వారిచ్చే చందా సొమ్ముతో కాలం గడుపుతూ, కర్మాగారాలు మూతపడే స్థితికి వచ్చినప్పుడు, ఏమీ చెయ్యలేక పోవడం చూస్తున్నాము. అయితే స్వార్థ రహితంగా పాటుపడే నాయకులు లేకపోలేదు. కాని, అలాంటి వారు చాలా తక్కువగా కనిపిస్తారు.

నిరుద్యోగులై శ్రమపడుతున్న వారిని చూచి, వారికి మంచి ఉద్యోగమిప్పిస్తామని మంచి మాటలతో లొంగదీసుకుని నమ్మిక కలిగిస్తారు. లంచమిస్తేగాని ఉద్యోగం దొరకదనీ, లంచంవల్ల అది తప్పక లభిస్తుందనీ, అధికారులు లంచం కోరుతున్నారనీ చెప్పి కొంత ధనం తీసుకుని మాయమయే రుద్రాక్ష పిల్లులు వారు! మనం — మంచి మాటలు చెప్పే అందరినీ నమ్మకూడదు. వాళ్ళు రుద్రాక్ష పిల్లులా, లేక మంచి స్వభావం కలవాళ్లా? అని బాగా పరిశీలించి, మరీ పరిచయం చేసుకోవాలి. ఏవో ఆశలు పెట్టి, అవి నెరవేరడానికి ధనం కోరేవారిని అసలే నమ్మకూడదు. అలాంటి వారివల్ల పని జరగదు, సరికదా! అపాయం కూడా కలగవచ్చును. ★

---

"గౌరవించండయ్యా, నేను మాత్రం కాదన్నానా? కానీ స్కూలు ప్రెమిసెస్‌లో మాత్రం వద్దంటున్నాను!" అతి మామూలే ధోరణిలో అన్నాడు గిరీశం.

"పరంధామయ్యగారూ, గిరీశంగారిని ఇబ్బందిపెట్టడం ఎందుకూ — స్కూలు బయట కావలసినంత ఖాళీస్థలం వుంది కదా, అక్కడ ఓపెన్ ఎయిర్‌లో చిన్న గెట్ టు గెదర్ ..." పరమేశ్వరం సర్దుబాటు ధోరణిలో అన్నాడు.

నీలాకాశపు చాందినీ కింద చిరుగాలి తెరల మధ్య టీచర్లందరూ కలుసుకున్నారు.

"ఒక ముఖ్యమైన విషయాన్ని మీకు తెల్పాలనీ, మీకు హెచ్చరిక చేయాలని వచ్చారు మా నాన్నగారు. రోజులు మారాయి, మీరో కొత్తరకం నియంతృత్వ పాలనలో వున్నారు. నియమాల్నీ, నిబంధనల్నీ పాటిస్తున్నట్టు కనబడుతూనే మీ యాజమాన్యం వాటిని కాలరాచి పారేస్తుంది. 'మా నాన్నగార్ని ఎందుకు సస్పెండ్ చేశారు?' అని అడగడానికని ఇంద్రసేన్ ఇంటికి వెళ్ళాను. అడిగినందుగ్గాను తక్షణం డిస్మిసల్ కాయితం నా చేతికిచ్చారు. మరోమాట మాట్లాడకుండా సర్వాభరణాల కిందా, సర్వలాంఛనాల కిందా, యాభైవేలకో చెక్కిచ్చారు!" మురళీకృష్ణ ఉద్రేకంతో చెబుతున్నాడు.

"యాభైవేలే!" వింటున్న వారిలో కలకలం. కొందరి మొహాల్లో రంగులు మారాయి. యాజమాన్యంపై ప్రశంసాభావం. మురళీకృష్ణ మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు.

"ఆ లాంఛనాలతో పాటుగానే నాకు దేహశుద్ధి చేశారు. మెట్లమీద నుండి తోయించారు. గేట్లో నుండి మెడబట్టి బయటికి గెంటించారు!"

"అయ్యో...అయ్యో...!"

"ఇవి చెప్పడం కోసం మేము రాలేదు. మురళీకృష్ణకు జరిగిన అవమానంపరే, అది వేరే సంగతి. ఇందులో ఒక అంతరార్థం దాగివుంది. అది మీకు తెలియబర్చాలనే ఇప్పుడు వచ్చింది." పరమేశ్వరం ముందుకు వచ్చి అన్నాడు.

"చెప్పండి...చెప్పండి...ఏమిటది?"

"యాజమాన్యం వారి దగ్గర శక్తివంతమైన ఆయుధం ఒకటి వుంది. మూడునెలల నోటీసిచ్చి, ఎంతకాలం నుంచి ఉద్యోగం చేస్తున్న ఏ పర్మనెంటు వాడ్నైనాసరే, ఒక్క కలం పోటుతో మెడపట్టి బయటకు గెంటవచ్చు. మూడేమూడు కారణాల్ని చూపించి ఎదుటివారి నోరు మూయించవచ్చు. క్రమశిక్షణ లేనివాడనీ, క్యారెక్టర్ లేనివాడనీ, బోధనకు అనర్హుడైపోయాడనీ. ఈ కారణాల్లో ఏ ఒక్కటైనా చాలు. నేను క్రమశిక్షణ లేనివాడుగా కనిపించాను. మరొకర్ని నీతిమాలినవాడనవచ్చు. మూడేళ్లదాటి ఉపాధ్యాయవృత్తిలోవున్నమీరంతా ఇంటికి వెళ్ళిపోవడానికి, ఏ చిన్న తగాయిదా, మనస్పర్థ మూలంగానైనా సరే, సిద్ధంగా వుండండి. నా బర్తరఫ్ మీకు వార్నింగ్!"

వింటున్న టీచర్లందరూ షాక్ తిన్నట్టుగా నిశ్చలంగా వుండిపోయారు.

"మేనేజ్‌మెంట్ నిజంగా అట్లా చేస్తుందంటారా?...యాభైవేలిచ్చిన యాజమాన్యం." వో డౌటింగ్ థామస్ గొణిగాడు. ఆ గొణుగుడు పరమేశ్వరం చెవుల పడనే పడింది.

"ఇదిగో నా కిచ్చిన చెక్! మీ సెక్రటరీ దగ్గర దాన్ని అట్టేపెట్టేస్తున్నాను. నేను తప్పు చేశాను, నా బర్తరఫ్ సమంజసం అనుకుంటే ఆ చెక్కును ఇంద్రసేన్‌కే తిరిగి పంపించేయండి. అది నా కక్కర్లేదు. నా రిమూవల్ అన్యాయం అనుకుంటే ఆ చెక్కును మీ దగ్గర డిపాజిట్ చేసేండి, అందరం కలసి ఫైట్ చేద్దాం. నిర్ణయం సాయంత్రానికి చెప్పండి."

(ఇంకా ఉంది)

# ఎందరో నాలాగ

డాక్టర్ ఎస్. గంగప్ప

ఏడెనిమిదేళ్ల కుర్రాడు 'అమ్మా అమ్మా' అంటూ దొర్లుతున్నాడు కుక్కి మంచంలో. సమాధానం చెబుతూంది రామలమ్మ. బాబుకు ఎవరో బహుమతి ఇచ్చిన కిడ్డీ బ్యాంక్ బొమ్మ మర త్రిప్పిత్రిప్పి చివరికి విజయం సాధించింది రామలమ్మ. అందులోని చిల్లర లెక్కపెట్టగా రెండు రూపాయల డెబ్బైమూడు పైసలు తేలింది. ఇరవైమూడు పైసలు అందులోనే ఉంచి రెండు రూపాయల యాభై పైసలు తిరిగి తిరిగి ఆవురావురుమంటూ వచ్చిన భర్త చేతికిచ్చింది డాక్టరు రాసిచ్చిన చీటీతోపాటు. బిళ్లలు తెమ్మని పురమాయించింది. రామకోటయ్య అర్థం చేసుకొన్నాడు— బాబు జ్వరంతో మెలికలు తిరిగిపోతున్నాడని, నుదుటిమీద చెయ్యి వేసి చూశాడు, గ్రహించాడు. వెంటనే లగెత్తుక పోయాడు. రామలమ్మ బాబుని కాస్త కనిపెట్టుక చూస్తుండమని పక్కింటి బామ్మతో చెప్పి గొప్పవారింట్లో పని చేయడానికి వెళ్లింది అప్పటికే ఆలస్యమైందంటూ.

'అమ్మగారండీ తలుపు తలుపండి'— అని కేకేసింది రామలమ్మ. ''ఓహో! రాణిగారా! ఇప్పటికి తీరికైందా? అయినా మిమ్మనే పని లేదు. తప్పు మాదే! మీదేం పోయింది. అప్పనంగా నెలాఖరుకు అందుకొంటారుగా జీతం? అప్పుడప్పుడూ ముందే అదని ఇదని పుచ్చుకుంటూనే ఉంటారాయె. ఇంకా నేను ఆస్పత్రికి వెళ్లాలి. అబ్బాయి కెలావుందో? కానీ...'' అని మామూలు ధోరణిలో ఆ సంపన్నురాలు కేకలు పెట్టింది. ''మా బాబుకి జరంగా ఉందండి. అందుకే కాస్త ఆలస్యమైందండి'' అంది రామలమ్మ. ''ఔనౌను. ఇది మామూలుపాటేగా! నేను అన్నాను గదా అని నీవు అదే అంటావు! సరే మీతో వేగలేం కానీ తొందరగ'' అంటూ చరచరా వెళ్లిపోయిందావిడ.

* * *

అమ్మగారి నడిగి తెచ్చుకున్న చిల్లర డబ్బులు పమిటలో ముడేసుకొంటూ ఇంటికి లగెత్తుకు వస్తుంటే దారిలో జనం గుమిగూడి ఉన్నారు. ఏమిటా అని చూస్తుండగానే రామలమ్మ తమ్ముడు పరుగున వచ్చి జరిగిన సంగతి చెప్పాడు. బాబు మందులకోసం ఇచ్చి పంపిన డబ్బుతో తప్పదాగి వచ్చి రోడ్డున పడ్డాడు రామకోటయ్య. తోడు గాని బాల్య స్నేహితుడు మరో తాగుబోతు ఉన్నారు. చాలా సిగ్గేసింది రామలమ్మకి చుట్టూ చేరిన జనాన్ని చూసి. వెంటనే పెనిమిటి దగ్గర కెళ్ళి ఇంటికి రమ్మని బతిమాలింది.

''నన్ను తాకకు. నేను అమృతం తాగాను, స్వర్గసుకంలో ఉన్నా. నీవెవురు? రంబా? మేనకా? ఎవరు? ఎవురైనా నన్నంటకు. నా రామలమ్మని తప్ప ఎవరిని తాకలేదు. రాముడు నా గురువు. ఒకే ఆడది. ఒకే మాట. సీతమ్మ అయినా లంకకు సెరపోయింది. సీతమ్మ కంటే నా రామలమ్మ పతివర్త. దూరం దూరం. తాకకు''— అంటుంటే ఓ పక్క సిగ్గు! మరో పక్క బాధ, ఇంకో పక్క ఏడుపు — ముప్పిరిగొని రామలమ్మ ఉక్కిరి బిక్కిరయిపోయింది. వెంటనే తమ్ముని, బాబాయిని, అన్నాయని పురమాయించింది. ప్రార్థించింది. వెంటనే వాళ్లు మూడు బిందెల నీళ్లతో సచేల స్నానం చేయించారు. అయినా దిగలేదు మత్తు. వెంటనే రామలమ్మ కోరికతో తమ్ముడూ, బాబాయి, అన్నాయిలు జబ్బ పట్టుకొని లాకెళ్ళి పాకలో మరో కుక్కి మంచంలో పడుకోబెట్టి వెళ్ళిపోయారు రామకోటయ్యని. తమ్ముడి చేతికి డబ్బిచ్చి పంపింది రామలమ్మ బాబు మందుల కోసం.

జ్వరంతో బాబు విలవిల్లాడి పోతున్నాడు. మూలుగుతున్నాడు. తడిగుడ్డ నుదుటమీద పెట్టింది రామలమ్మ. దొర్లుతూ ఉండటంవల్ల గుడ్డ నిలవడంలేదు నుదుటిమీద. అలా కొంత సేపు పట్టుకు కూర్చుంది రామలమ్మ. బాబుని అనునయిస్తూంది.

మందు మత్తు తొలగిపోయాక మామూలు మనిషయ్యాడు రామకోటయ్య. గుడ్డలంతా తడి. చలిచలిగా ఉంది. ఏమిటా అని ఆశ్చర్యపోయాడు. ముందటి విషయం గుర్తుకు వచ్చింది. బాబు మందుల కోసం వెళ్లుతుండగా తన బాల్యస్నేహితుడు కల్లుపాకకు బలవంతాన తీసుకుపోవడమూ, అక్కడ వాని బలవంతంతోనే ఒక పెగ్గే అంటూనే తెగ తాగడం వరకు గుర్తుకుంది. తరువాత ఏమైఉంటుందో గ్రహించాడు. అస్పష్టంగా అడిగాడు భార్యని. రామలమ్మ పూస గుచ్చినట్లు చెప్పింది జరిగిన సంగతి. కోపోద్రిక్తుడయ్యాడు రామకోటయ్య. ఇంత అవమానం బజార్లో చేస్తుందా? అంటూ బుసకొట్టుతూ పాకలో మూలలోఉన్న కొడవలి తెచ్చి నరుకుతానంటూ, చంపుతానంటూ మీది మీదకి వచ్చాడు. బాబు జ్వరంలో ఒకటే బెంబేలు పడుతూ బొబ్బరిస్తున్నాడు. అయినా లెక్క చేయలేదు రామకోటయ్య. అవమానంతో కుంగిపోయిన తనకు కోపం కట్టలు తెంచుకొస్తుంది. తాగి తన మానాన ఉంటే ఉంటాడు. కాని బజార్లో అందరి ఎదట బిందెలనీళ్లు పోయిస్తుందా? ఛీ! ఛీ! ఎంత అవమానం? గుడ్లురిమి బలాన్నంత పుంజుకొని నరకడానికి ఉద్యమిస్తున్నాడు. రామలమ్మ అదరలేదు, బెదరలేదు. ఆమె ఆత్మశక్తి అలాంటిది. ఎంత కాలమని అణగి మణగి ఉండటం! తన రెక్కాడితేగాని ఇంటిల్లిపాది డొక్కాడదు. ఆ విషయం మరచిపోయి తన్ను నరకడానికి యత్నిస్తున్నాడీ మగరాయుడు సిగ్గులేక— అంటూ గుండె దిటవుతో ఉంది.

ఎప్పుడూ భర్తతో పల్లెత్తి మాటలాడని రామలమ్మకు కోపం వచ్చింది. దిగమింగుకొంటూనే ''బలిపశువులాగా మెడవంచే రోజులు పోయాయి. మెడ వంచితే చంపగలవు. కానీ నేనలా చేయను. స్త్రీశక్తి స్వరూపిణి అనే సంగతి మరువకు. నీ చేతిలోని కొడవలి తీసి పారేయలేననుకోకు. కాని నీవే గ్రహిస్తే మంచిది. నా రెక్కల కష్టంతో ఇలా వెళ్లదీస్తున్నాను సంసారాన్ని. బాబు జరంతో విలవిల్లాడిపోతుంటే మందులకోసం డబ్బు ఇచ్చి పంపితే తప్పతాగి, పైపెచ్చు చంపడం నీకే తగింది. చాలాబాగుంది. చంపు చంపు అంటూ మీకు లొంగితే మీ పురుషాధికారాన్ని చలాయిస్తునే ఉంటారు మీ మగవాళ్లు. నేనలా అనడంలేదు. ఇల్లు ఒల్లూ గుల్ల చేశావు; మనసు పాడుచేశావు, శాంతి సుఖం లేవు. పైగా ఈ రభస, అంటూ బాబుని సముదాయిస్తూ ఉంది రామలమ్మ. తన్ని లెక్క చేయటంలేదని తెలుసుకొన్న రామకోటయ్యకి కోపం ఇబ్బడిముబ్బడి అయింది. వణికిపోతున్నాడు. మోహం కందగడ్డలా తయారైంది. నుదుటిపై ముడతలు పడ్డాయి. కళ్లు ఎర్రబడ్డాయి. పెదవులు వణికిపోతున్నాయి. ముచ్చెమటలు పోశాయి; మాటలు మాత్రము పెగల్లేదు. నరకడానికి చేయి వంగడంలేదు. చిత్రంలోని బొమ్మలా ఉన్నాడు రామకోటయ్య. కోపం చల్లారలేదు. పైపెచ్చు పెరుగుతూంది. కారణం రామలమ్మ తనని అలక్ష్యం చేయడమే. తప్పక నరికి పోగులు పెట్టాలన్న కోరిక, ప్రతీకారము తీర్చుకోవాలన్న తలపు మరీ మరీ పెరిగిపోతున్నాయి. అయినా రామలమ్మ మాత్రం లెక్క చేయలేదు. పైగా బాబు గురించే ఆలోచిస్తుంది. మందుల కోసం వెళ్లిన తమ్ముడింకా రాలేదే అని చింతిస్తుంది.

* * *

రామలమ్మ తండ్రి వ్యాపారం చేసి చితికిపోయి బ్రతికిచెడ్డవాడు. రామలమ్మ అంతో ఇంతో చదువుకొంది. అపురూప సౌందర్యవతి కాకపోవచ్చుగాక. అనాకారి మాత్రం కాదు. యౌవనంలో చూడముచ్చటగా ఉండేది. తన దూరపు బంధువుల చుట్టాల్లో ఒకడు రామకోటేశ్వరరావు. ఆస్తిపాస్తులు లేవు. నావారన్న వారు ఎవరూ లేరు. ఒక ఫ్యాక్టరీలో పని చేస్తూ నాలుగు రాళ్లు సంపాదిస్తున్నాడు.

అతనికిచ్చి తన గౌరవానికి తగిన రీతిగా రామేశ్వరి పెళ్లి జరిపించాడు వాళ్ల నాన్న. కొంతకాలం బాగానే గడిచిపోయింది. సావాసగాళ్లతో తాగుబోతై పోయి ఆరోగ్యం చెడి ఉద్యోగం పోగొట్టుకొన్నాడు రామకోటేశ్వరరావు. తరువాత రామకోటయ్య అయిపోయాడు. ఈ తాగుబోతుకి మళ్లీ ఎక్కడ ఉద్యోగం దొరకలేదు. అనారోగ్యంతో మంచం పట్టాడు. ఇంతలోపల ఇద్దరు బాబులు పుట్టి పోయారు రామలమ్మకి. మూడోసంతానం జ్వరంతో బాధపడుతున్న బాబు. మూడో సంతానంతోనే భర్త అంగీకరించకపోయినా తరువాత సంతానం కలగకుండా ఆపరేషన్ చేయించుకొంది రామేశ్వరి కాదు – ఇపుడు రామలమ్మ, చాల తెలివిగలది. గొప్పవారి ఇళ్లలో అంట్లుతోమి, పాచిపని చేసి సంసార సాగరాన్ని ఈదుతుంది. క్రమంగా రామకోటయ్య కొంత స్వస్థత చిక్కినా తాగుడు మాత్రం మానుకోలేకపోయాడు. ఈ తాగుడు వల్ల అనేక అనర్థాలు. అతని ఆరోగ్యం చెడిపోవడమేగాక రామలమ్మకి మానసిక రుగ్మత కలిగింది. సంపాదకుడసలే కాలేకపోయాడు. రామలమ్మ సంపాదనతోనే తాను జీవించడంతోపాటు తాగుళ్లకి పీడిస్తూనే ఉంటాడు. దీనివల్ల రకరకాల అల్లర్లు అయినా ఎంతో శాంతంతో, సహనంతో సంసారాన్ని లాక్కొస్తూంది రామలమ్మ. రామకోటయ్య మాత్రం తన అలవాట్లని, సావాసగాళ్లని వదిలించుకోలేకపోతున్నాడు. తాగుడు మానుకొంటున్నానని ఎన్నిసార్లో మాటిచ్చినా నిలబెట్టుకోలేకపోయాడు. ఈ మధ్యనే కాస్త బుద్ధిగా ఉంటున్నాడనుకొంది రామలమ్మ కొంతఊరటతో. దాంపత్య జీవితాన్ని తానెంతో సుఖంగా హాయిగా గడిపింది రామలమ్మ కొంతకాలం. కానీ ఈనాటి స్థితిని పోల్చిచూస్తే హస్తిమశకాంతరం. అద్దె ఇంటిలోనే అయినా సుఖంగా కాలం గడుపుతూ వచ్చారు. రామకోటయ్య ఉద్యోగం ఊడాక ఈ పాక గతి అయింది. సూర్యచంద్రులు, వాయుదేవుడు పాకలోనే ఉంటారు. వర్షం వస్తే సరేసరి. అతుకుల బొంతలతో నడచీ నడవని సంసారాన్ని సాగదీస్తూంది రామలమ్మ.

తన పూర్వస్థితి, ఈనాటి దుస్థితిని గూర్చి చెప్పింది. ఎంత సుఖంగా, హాయిగా కాలం గడిపింది గుర్తుకు తెచ్చింది. ఏ స్థితిలో చిల్లర చేతిలోపెట్టి బాబుకు బిళ్లలు తెమ్మందో జ్ఞాపకం చేసింది. ఇంకా బాబు ఎలా విలవిల్లాడి పోతున్నాడో చూపింది. అంతే తప్ప భర్త తనను నరకుతాడన్న విషయాన్ని లెక్కచేయనేలేదు. అలాంటి స్థితిలో నుంచి ఎలాంటి దుస్థితికి భర్త వచ్చిందీ వివరించింది. తన రెక్కల కష్టంమీద బతికే అతనికి ఇంతకంటే సాధ్యమయ్యే పనిలేదని స్పష్టం చేసింది. భర్త గౌరవమే తన గౌరవమనీ, కుటుంబ గౌరవమనీ సున్నితంగా చెప్పింది. అంతా అర్థం చేసుకొన్నాడు. చేతిలో కొడవలి జారిపోయింది. నిశ్చేష్టుడై పోయాడు రామకోటయ్య. కొయ్యబారి పోయింది దేహం. నోట మాట లేదు. చివాలున ఒక మూలలో కూలబడి నెత్తిన చేతులు పెట్టుకొని సన్నగా దుఃఖిస్తున్నాడు. తాను తలపెట్టిన ద్రోహానికి బాధ పడుతున్నాడు. తన్నుతాను అసహ్యించుకొన్నాడు. ఎంత ఘోరం జరిగి పోయేది ! తనలోని రాక్షసుడు చచ్చిపోయాడు. జరిగిపోయిన దానికి సిగ్గు పడుతున్నాడు.

తమ్ముడు మందులు తెచ్చి ఇచ్చాడు. ఎవరూ మాట్లాడటం లేదు. రామలమ్మ బాబుకి మందివ్వడంలో నిమగ్నమయింది. బావ సంగతి తెలుసుకొన్నాడు రామలమ్మ తమ్ముడు. సంతృప్తిని పొందాడు. సంతోషంగా బయటికెళ్లాడు. 'ఈ పవిత్ర భారతావనిలో ఇలాంటి భర్తలతో వేగుతున్న నాలాంటి అభాగినులెందరో ?' అంటూ నిట్టూర్చింది రామలమ్మ. ★



# వ్యక్తిగతం



ఈయన పేరు సి. ఫ్రెడ్‌బుష్. వయసు 11. నాలుగు కాళ్లు. ఒక తోక ఉన్నాయి. "ఫ్రెడ్ కథ : ఒక శునకం జీవితం" అనే పుస్తకాన్ని తన యజమానురాలి సహాయంతో ఈ రచయిత పూర్తిచేశాడు. దీని వెల 12 డాలరులకి కొంచెం తక్కువ. అంటే దాదాపు 120 రూపాయలు. యజమానురాలి పేరు బార్బరా బుష్. యజమాని పేరు జార్జిబుష్. జార్జిబుష్ ఏంపని చేస్తున్నాడు ? అమెరికా సంయుక్త రాష్ట్రానికి ఉపాధ్యక్షుడుగా ఉంటున్నాడు.

సి. ఫ్రెడ్‌బుష్ రాసిన పుస్తకంమీద వచ్చేదంతా ధర్మానికి వెళ్లిపోతుంది. (బొమ్మ, వార్త టైమ్ పత్రికలో పడ్డాయి.)



నజ్మల్‌హసన్ ఒక భారతీయ పత్రికా విలేఖరి. రాయిటర్స్ వార్తా సంస్థ తరఫున ఇరాన్‌లో యుద్ధాన్ని గురించి వార్తలు పంపటానికి వెళ్లాడు. అక్కడ ఒక బాంబు పేలి మరణించాడు. ఆయనకి 37 ఏళ్లు. భార్య పేరు బార్బారా. వీరికి 9 ఏళ్ల కూతురూ, 6 ఏళ్ల కొడుకూ ఉన్నారు ...



శ్రీమతి నిర్మలా నిత్యానందం శ్రీలంకలో ఆడవారి హక్కుల కోసం పోట్లాడుతున్న రచయిత్రులలో ఒకరు. ఈమెని ఇటీవలే వెలికాడె జెయిలులో తక్కిన తమిళులతోబాటు చంపివేశారు. ఈమె వయసు 30...

# వారఫలం

9–9–1983 శుక్రవారం మొదలు     15–9–1983 గురువారం వరకు

♈ మేషం: బంధువిరోధం చెప్పదగిన వారం. అనవసరపు విషయాలలో జోక్యం ఏర్పడనున్నది. చాలమందికి సాహితీ రంగంలో ప్రగతి ఏర్పడుతుంది. వ్యాపారం సాధారణంగా సాగిపోతుంది. స్త్రీలకు: విద్య పెంపొందటం, సభాగౌరవం, వృత్తిలో వృద్ధి, నూతన వస్తు సేకరణకు అవకాశం ఉన్నది.

♉ వృషభం: ధనాదాయమున్నది. అవసరాలు నెరవేరే మార్గం, అప్రయత్న ధనలాభం, అధికారుల వలన జరుగవలసిన పనులుంటే సుకరంగా నెరవేరటం, ముఖ్య బంధు సమాగమం, వృత్తిలో పెంపు మున్నగు సుగుణాలు కన్పిస్తాయి. స్త్రీలకు: నూతన నాంశాలు గ్రహించటం, మిత్ర సందర్శనానికి అవకాశమున్నది.

♊ మిథునం: వ్యాపారం బాగా సాగుతుంది. వ్యవహార రంగంలో మీ యభీష్టం నెరవేరుతుంది. మీ ఆశయ సిద్ధికి అనుగుణ్యమైన ప్రోత్సాహం ఏర్పడుతుంది. విలాస వస్తు సేకరణకు సర్వ విధాలా అవకాశం గలవారం. స్త్రీలకు: ఎంత యత్నించినా సుకరంగా నెరవేరని ఒకానొక విషయం ఈ దివం జరుగుతుంది బంధు వర్గం వలన శుభ కార్యాలోచనలు నెరవేరుతాయి.

♋ కర్కాటకం: దూర బంధువులు యింటికి రాగలరు. శుభ కార్యాలోచనలకు అవకాశమున్నది. సాహితీ రంగంలో పేరు ప్రతిష్ఠలకు, ధనాదాయానికి అవకాశం గలవారం. వస్తు సేకరణకు, లేదా వాహన సేకరణకు అవకాశమున్నది. స్త్రీలకు: ధనాదాయం అభివృద్ధి.

♌ సింహం: నూతన మిత్రుల కలయికకు, నూతనాంశాలు తెలిసికొనుటకు, అపూర్వ వస్తు సేకరణకు, సముద్ర ప్రాంతాలకు చాలమంది ప్రయాణించటం చెప్పదగిన అంశాలు. వృత్తి ఉద్యోగాలు అనుకూలదాయకాలు, చాలకాలంగా నిలచిన ధనం సమయానికి అందటం విశేషం. స్త్రీలకు: ఆదాయం, వృత్తి వికాసం చెప్పదగిన అంశాలు.

♍ కన్య: భూముల విషయంలో, గృహ విషయంలో తగాదా తంటాలు రాకుండా చూచుకోండి. అనవసర విషయాలలో జోక్యం కలుగజేసికొనటం శ్రేయస్కరం గాదు. రచనా, నటనా వ్యాసంగాలలో అనుభవం ఉన్న వారికి ఆదాయం, అభివృద్ధి, మేలు, సదవకాశాలు లభించటానికి ఆక్షేపణ లేదు. స్త్రీలకు: ఉద్యోగంలో అభివృద్ధి, కొందరకు నూతనోద్యోగ ప్రాప్తికి అవకాశమున్నది, గ్రహించాలి.

♎ తుల: వారమంతా చికాకుగా ఉంటుంది. అయినవారితో కానివారితో తగాదా తంటాలుంటాయి అందుకు తోడు అప్పుల వారి గొడవ అధికం. అనుకొన్న పని నెరవేరకపోవటం, వ్యాపారం సాఫీగా జరగకపోవటం, గమనిస్తారు. స్త్రీలకు: అధిక గౌరవం, వస్తు సేకరణకు అవకాశమున్నది.

♏ వృశ్చికం: నలుగురిలో ప్రతిష్ఠ ఉన్నది. అయినా అపనిందలకు గురి కావలసిన సన్నివేశం చెప్పవీలున్నది. బంధువుల రాకపోకలతో, పరులకు సహాయపడటంతో వారం గడచిపోతుంది. వ్యాపారస్థులకు మాత్రం మిక్కిలి పెంపు, ఆదాయానికి అవకాశమున్నది. స్త్రీలకు: బంధుప్రీతి, ఆదాయం, అభివృద్ధి చెప్పదగిన అంశాలు.

♐ ధనుస్సు: విరోధి వర్గాన్ని ఒకకంట కనిపెట్టవలసిన అవసరం ఉన్నది. ఎంతో ప్రయాసపడి కొనుగోలు చేసిన వస్తువులు, మతిమరపు వలన పోగొట్టుకొంటారు. డబ్బుకు బాగా చికాకులు ఏర్పడుతాయి. స్త్రీలకు: శుభకార్యానుకూలత, సంతానం కొరకు చేసే ఉద్యోగ ప్రయత్నాలు ఫలవంతంకావటం విశేషం. నిలచిన పైకం వసూలుకు యత్నించాలి.

♑ మకరం: అభివృద్ధి కార్యక్రమంలో పాల్గొంటారు. ఉద్యోగవృత్తులందు ప్రగతి చెప్పదగిన అంశం. చాలదినాలుగా ఉద్యోగం నిమిత్తం పడిన ప్రయాస ఫలితానికి రాగలదు. సమాన హోదాలో ఉన్నవారి సహాయం అందుకోగలరు. ఉద్యోగంలో చాలమందికి 'ప్రమోషన్' లభించే మార్గమున్నది. స్త్రీలకు: ఉన్నత పదవి, సుఖ సంతోషాలు, ఆనందకరమైన వార్తా శ్రవణం చెప్పదగిన అంశాలు.

♒ కుంభం: ఎంత నీతి నిజాయితీతో ప్రవర్తించినా, ఇతరుల దృష్టిలో మీ రేదో తప్పు చేసిన వారే. అనవసరమైన గొడవలకు, అపనిందలకు దారి తీసే వారమే. చాలమంది ఉద్యోగరీత్యా యితర ప్రాంతాలకు పోగలరు. స్త్రీలకు: విద్యలో పెంపు, వృత్తిలో ప్రగతి నూతనాంశాలు తెలిసికోవటం జరుగుతుంది.

♓ మీనం: ధనలోపం లేదు, వ్యాపార లోపం లేదు, అధికారులను ఆశ్రయించి ప్రయోజనం లేదు. వ్యాపార విషయంలో అధికారుల గమనించి మెలగాలి. కొందరకు బంధువుల తాకిడి గలవారమే. స్త్రీలకు: నూతనాంశాలు తెలిసికోవటం, వృత్తి వికాసం, కించిత్తు ఆదాయం చెప్పదగిన అంశాలు. గ్రహించి శ్రమించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# సిరిలాక్‌లో పాలు వుండనే వున్నాయి–




దీనిని నీటికి కలపండి రుచికరమైన...



సంపూర్ణాహారం సిద్ధమయింది!




సిరిలాక్‌ని గోరు వెచ్చని, ముందుగా మరగ బెట్టిన నీటికి కలపండి. అంతే, మీ పాప ఆహారం సిద్ధం అయినట్లే. అందులో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు పంచదార సరియైన పాళ్ళలో వుండడంతో సిరిలాక్ రుచికరమైన సంపూర్ణ పోషకాహారం.

మీ పాపకి 4 నెలల ప్రాయం వచ్చేసరికి, పాపకి సిరిలాక్ ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సిరియల్ ఇవ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®

ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సిరియల్

NESTLÉ

SAA/FSL/C/2834 TEL

సీరియల్

# మూగ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

(గత సంచిక తరువాయి)

ఆ తరువాత పదిరోజులవరకు మళ్లీ సారధి రేఖతో మాట్లాడలేదు. శ్రీనివాస్ ఓసారి యింటికి వచ్చాడు రేఖ కోసం ! సీతని పరిచయం చేస్తాను రమ్మన్నది రేఖ—

"వద్దులే రేఖా ! నాకు ... అలాంటి గొప్ప వాళ్లతో మాట్లాడ్డం రాదు!" అన్నది దుఃఖాన్ని దిగమింగుతూ —

"సారధితో చెప్పనులే ! రా !"

"వుహూ ! నువ్వెళ్లు ! " సీత గుమ్మాన్ని పట్టుకుని నిలబడి పోయింది. రేఖ వెళ్లిన తరువాత గుమ్మం పైనే తల పెట్టుకొని పెద్దగా ఏడ్చింది. ఎంతసేపలా ఏడ్చిందో తెలియదు. ఏడవడానికి ఓపికేలేని దానిలా అక్కడే కూర్చుండిపోయింది తరువాత !

"సీతా ! ఏవిటిలా తలుపులు తీసే వుంచావు ? నిద్రబోతున్నావా ?" సారధి వచ్చాడు — ఆమెలోని దుఃఖం మళ్ళీ మహా సముద్రమై పుప్పొంగింది.

"ఏమిటమ్మా ? అలా కూర్చున్నావ్ ? ఒంట్లో బావుండలేదా ? అమ్మను చూడాలని వుందా ?" సారధి ప్రశ్నలకి జవాబే యివ్వలేదు—

"సీతా ! ఏమైందమ్మా ? "

"ఆయన ... వచ్చారన్నయ్యా! ... రేఖ ...తో కలిసి ... వెళ్లిపోయారు ... " మోకాళ్ళ మధ్యన తల పెట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తోందామె.

"నిన్ను చూశాడా ? "

లేదన్నట్లు తల వూపింది.

"నువ్వే పలకరించకపోయావా ?"

"రేఖ ... గుండెలు పగిలిపోవూ ? రేఖ మాత్రం నాలాంటి మనిషి గాదా అన్నయ్యా ?"

"కానీ ... ప్చ్ ! పోనివ్వు ! ... నేను రేఖకి చెప్పేస్తా నీ రహస్యం ! అప్పుడైన కాస్త మనిషిలా ఆలోచిస్తుందేమో ! ! "

"రేఖ ... యీసారి మోసపోతే ప్రాణాలు తీయడానికైనా సిద్ధమేనన్నది ! నేను ... మరో విధంగా చెప్పాను ! అతని...భార్య నాకు తెలుసని చెప్పాను ! అయినా...భయంలేదు పొమ్మన్నది !" సీత కన్నీరు తుడుచుకుందప్పటికి.

"ఈ మనుషులింతగా ఎలా దిగజారి పోతారు ? ఎందుకింతగా పతనమైపోతారు ? ఈ రేఖకేదో దయ్యం పట్టుకుంది ! ఎవరినీ లెఖ్ఖచేయదు ! ఏమైపోతుందో మరి !" సారధి విచారాన్ని వెలిబుచ్చాడు.

ఆ రాత్రి బాగా ప్రొద్దుబోయిన తరువాత ఎవరో తలుపు కొట్టినట్లు విన్పించి సారధి లేచి వెళ్లి తలుపు తీశాడు.

రోడ్డుపైన కారు స్టార్టు చేసిన శబ్దం విన్పించింది.

సారధి వరండాలోకి వెళ్ళాడు. రేఖ తూలుతూ లోపలికి వచ్చింది. అతడా వాసన భరించలేనన్నట్లు ముక్కుకి రుమాలు అడ్డం పెట్టుకున్నాడు.

"రేఖా !... నువ్వు... నువ్వు... త్రాగావామ్మా ?" అతనికి కోపం, ఏడుపూ, రెండూ వచ్చాయి.

"సారీ ! మై బ్రదర్ ! నువ్వేడుస్తావని తెలుసు ! అయినా నన్ను నేను నిగ్రహించుకో లేక... పోయాను ! అయినా నువ్వెందుకు ఏడవడం ?! ఏడవ్వలసింది నేను బ్రదర్ ! ఏడ్చినా... గుండెల్లో బరువు తగ్గలేదన్నగారూ ! అందుకే... ఏడ్చినా... నా గుండెలకి... విన్పించకుండా... వుంటుందని... త్రాగేశాను ! ఊరుకోరా అన్నయ్యా ! మళ్ళీ ఏడుపు నన్ను ముంచేస్తుంది ! ఈవేళ నా మనస్సు మరిన్ని ముక్కలైపోయింది ! ఎందుకని అడిగితే... కారణం చెప్పేస్తానన్న భయంతో పిచ్చిగా త్రాగేసింది యీ రేఖ ! నేనంటే ఎందుకురా నీకింత ప్రేమ ? నేను... మంచి మనిషిని... కాదురా ! నాకు... నీతిగా... నియమంగా... బ్రతకడం రాలేదురా !... కాదు... సాధ్యంగాదురా !

హుష్ ! సీత వింటుందేమో ! నెమ్మదిగా ఏడవరా అన్నయ్యా ! నాక్కూడా విన్పించనంత నిశ్శబ్దంగా ఏడవాలి బ్రదర్ ! లేకపోతే... నా మనస్సు... నన్ను మరింత నిర్దాక్షిణ్యంగా కోసివేస్తుంది ! గుండెలు పగిలి ఛస్తుందేమో యీ రేఖ నీ బాధని చూడలేక !" రేఖ అతని గుండెలపైన వాలిపోయి పసిపిల్లలా వెక్కి వెక్కి ఏడవసాగింది !

"మాట్లాడకమ్మా! మాట్లాడకు!" సారధి దుఃఖాన్ని గొంతులోనే అదిమిపెట్టాడు. అతడామెను నెమ్మదిగా నడిపించుకుని వెళ్ళి మంచం మీద పడుకోబెట్టాడు. చెప్పులు తీసివేయబోయాడు. ఆమె వారించింది.

**జరిగినకథ — 6 :** సోమయాజులుగారి మనుమరాళ్లు విజయ, రాజ్యలక్ష్మి. సారధితో విజయ పెళ్లి ఆగిపోయింది. సోమయాజులుగారు ఇచ్చిన డబ్బులో 5 వేలు తక్కువగా సారధి సోమయాజులుగారికి తెచ్చి ఇస్తాడు. అతని ప్రవర్తనకు ముగ్ధులయ్యారు సోమయాజులుగారు. సారధి విజయ, రాజ్యలక్ష్మిల బాధ్యతను స్వీకరిస్తాడు. సోమయాజులగారిచ్చిన డబ్బుతో తన కూతురు సీత పెళ్లి చేస్తుంది అరుంధతమ్మ. తన వైవాహిక జీవితం సుఖంగా లేదని సారధి చెల్లెలు సీత అతనికి ఉత్తరం రాస్తుంది. సారధి తన స్వంత చెల్లెలు శశిరేఖను సన్మార్గంలో పెట్టుటకు ప్రయత్నిస్తుంటాడు. శశిరేఖ, సారధి ఒకరికొకరు తమ జీవితానుభవాల్ని చెప్పుకుంటారు. రెండు మూడు రోజులు ఇంటికి రాని శశిరేఖ కోసం ఆమె ఆఫీసుకు వెళుతాడు సారధి. శ్రీనివాస్ అనే ఆఫీసర్‌తో కలిసి శశిరేఖ ఢిల్లీ వెళ్లిందని తెలుసుకొని క్రుంగిపోతాడు. ఆమె రావ్‌ అనే అతనికి తనను గురించి వ్రాసిన ఉత్తరం చదువుతాడు. ఢిల్లీ వెళ్లిన శశిరేఖ తిరిగి వస్తుంది. సలీం, సారధి, శశిరేఖ, ఆషా కలసి సలీం కారులో సినిమాకు వెళుతారు. సలీంకు సారధిపట్లగల ఆరాధనను మనస్సులోనే మెచ్చుకొంటుంది శశిరేఖ. సారధి, శశిరేఖ సినిమానుంచి కారులో వెళ్లగా, సలీం ఆషాను టాక్సీలో వాళ్లింటి దగ్గర దింపి వెళుతాడు. సారధి శశిరేఖతో విసిగి ఆమెను వదిలేసి సీత దగ్గరకు వెళుతాడు. సీత భర్త శ్రీనివాస్ అని తెలుసుకుంటాడు. శశిరేఖను చూడాలంటుంది సీత. తను విజయకు తగనని సోమయాజులు గారితో అంటాడు సారధి. మనిషికి మనస్సు ముఖ్యం కానీ, కులం ప్రధానం కాదని చెవుతాడు సోమయాజులు. సోమయాజులుగారికి పక్షవాతం వస్తుంది. విజయను, రాజ్యంను ఆయన దగ్గరకు తీసుకెళతాడు సారధి. సోమయాజులుగారికి సలీంను పరిచయం చేస్తాడు. సీత సారధి ఇంటికి వచ్చి అక్కడ శశిరేఖను చూస్తుంది. శ్రీనివాస్‌కన్నా మంచివాడిని తెచ్చి పెళ్లి చేస్తానని సారధి శశిరేఖకు చెప్పబోగా ఆమె అతని మాట వినకుండా అతనితో ఘర్షణ పడుతుంది.

''వద్దు బ్రదర్ ! వాటిని ముట్టుకోకు ! నీక్కూడా పాపం అంటుకుంటుంది !'' చెప్పుల్ని నెమ్మదిగా జారవిడిచింది.

''ఒరే ! అన్నయ్యా !...నువ్వు... నువ్వు... ఎపుడైనా త్రాగావా ?'' మళ్ళీ అడిగింది.

''లేదులే పడుకో !''

''ప్చ్ ! ప్చ్ ! ఒక్కసారి తాగేసనిరా! నిన్ను చూస్తే జాలేస్తోందిరా ! ఈ నీ బాధలన్నిటికీ... కారణమైన... యీ రేఖని... మర్చిపోయేవాడివి! ఈ నిషా మనిషిని చంపినా హాయిగా వుంటుందిరా ఆ మరణం !''

''రేఖా ! మాట్లాడకమ్మా !''

''ఏదీ ! ఇంకొక్కసారనరా ! 'అమ్మా ! రేఖా'అని.. అమ్మ... పిలిచినట్టుందిరా !...అమ్మే యిలా... జరిగేది గాదు... వుహూ ! జరిగేది గాదు !... ఎందుకు జరుగుతుంది ! అన్నయ్య . నేనూ... ఎంచక్కా... ఆడుకునేవాళ్ళమో !'' రేఖ మాట్లాడుతూనే నిదురలోకి జారిపోయింది.

''ఈ సర్వనాశనాన్ని నేనెలా చూడనమ్మా ! ఎందుకు తల్లీ ? యిలా నిన్ను నీవే దహించి వేసుకొంటున్నావు ? నీ గుండెల్లోవున్న బాధని పంచుకోడానికి నేనున్నానమ్మా ! నా నుంచి దూరంగా పారిపోతే నీకు మనశ్శాంతి లభించదు తల్లీ ! నీకోసమే బ్రతుకుతున్నానని నీకెన్నిసార్లు చెప్పాను? 'అన్నయ్యా' అని పిలిస్తే నాకెంత సంతోషంగా వుందో చెప్పలేనమ్మా !'' సారధి ఆమె చేతుల్లో ముఖం దాచుకుని మౌనంగా మనస్సు విప్పి చెప్పుకున్నాడు. ఎంతో సేపటివరకు అలాగే కూర్చుండిపోయాడు.

మరునాటి వుదయం మళ్ళీ మామూలుగానే ప్రవర్తించింది శశిరేఖ.

''రేఖా ! నువ్వు రాత్రి ఎలా వచ్చావో గుర్తుందా ?''

''త్రాగి వచ్చాను ! నేనేమీ సిగ్గుపడను చేసిన పనిని చేశానని చెప్పడానికి !''

''ఎందుకలా త్రాగటం ! ఏం లభించింది నీకు ?'' సారధి ప్రశ్నించాడు.

''త్రాగడం రాని నీకెలా తెలుస్తుంది ? ఆ నిషాలో ఎంత ఆనందం వుందో !''

''ఎవరు త్రాగుతారో తెలుసా ?''

''చెడిపోయినవాళ్ళు, చెడబోయేవాళ్ళూ త్రాగుతారు ! ఇదేగా నువ్వు చెప్పబోయేది ! నేను మంచిదాన్నని నీకెపుడైనా చెప్పానా ?''

''ఇపుడెందుకు మారగూడదు ?'' సారధి కోపాన్ని అణిచిపెట్టాడు.

''ఎందుకు మారాలి ?''

అతడా ప్రశ్న విని నిర్విణ్ణుడైపోయాడు.

''రేఖా ! నీ కోపం ఎవరిమీద ?'' సీత ప్రశ్నించింది.

''నీమీద మాత్రం గాదు ! పైగా నాకు నిన్ను చూస్తే జాలివేస్తోంది ! ఈ సారధి నిన్నుద్ధరిస్తాడని కలలు గనకు !''

''అన్నయ్యా ! నువ్వెళ్ళు ! కాలేజికి టైమయింది !'' సీత, సారధిని కావాలనే వెళ్ళమంది.

''నాకు మీ అన్నయ్యంటే మహామంట !'' రేఖ బూట్లు వేసుకుంటూ అన్నది.

''ఎక్కడికెళ్తున్నావ్?'' సీత ఆమె మాటల్ని పట్టించుకోలేదు.

''శ్రీనివాస్‌తో పనుంది ! ఏం ? నువ్వూ వస్తావా ?''

''ఛీ ! ఆ మనిషంటే నా కసహ్యం !''

శశిరేఖ ఒక్క క్షణంపాటు సీత వైపే చూస్తూండిపోయింది.

''ఏం ? నిన్నేం చేశాడు ?''









## మూగ ముత్యాలు

"నిన్నెందుకు పెళ్ళాడగూడదు ?"

"ఒకసారి పెళ్ళయిన మనిషి కదెలా సాధ్యం?! ఆ మొదటి భార్య కోర్టుకు వెళ్ళదూ ?"

"వెళ్ళదు ! రేఖా ! నా మాట విను ! ఆ అమ్మాయి నాకు బాగా తెలుసు ! జీవితంలో స్థిరపడదు యికనైనా ! అన్నయ్య ప్రొద్దున కూడా కంట నీరెట్టుకున్నాడు నీకోసం ! అన్నం పెడితే తినలేనని వెళ్ళిపోయాడు ! వాడు నీకోసం, అన్ని సుఖాల్నీ వదులుకుని బ్రతుకుతున్నాడు !" సీత గుండెల్లో దుఃఖం ఘోషిస్తోంది.

"నాక్కొన్ని వ్యవధి కావాలి సీతా ! ... శ్రీనివాస్‌ని...నేను ప్రేమించడంలేదనిపిస్తోంది!"

శశిరేఖ తల వంచుకుని పాంటు మడతల్ని సరిజేసుకుంటూ కళ్ళు వత్తుకుంది. సీత గమనించలేదు.

"నాతో అబద్ధం చెప్పకు రేఖా !"

"నిజంసీతా ! నీ ముందు నేనేమీ దాచనిక ! కనీసం రెండేళ్ల ముందు నువ్వు కన్పిస్తే యీ రేఖ యిన్ని పాపమ్ము నేర్చుకునేది గాదు ! నాకెవరినీ ప్రేమించాలన్పించడంలేదిపుడు ! ఎందుకో నాకే తెలియదు ! నా మనస్సు చచ్చిపోయిందన్పిస్తోందప్పుడప్పుడు !"

"అందుకే...శ్రీనివాస్‌గారితో..."

"మాట్లాడంలేదు ! ఇపుడంత తొందరెందుకు చెప్పు ?! ఓసారి సోమయాజులుగారిని చూసివద్దామా సీతా ! విజయని కూడా చూడాలని వుంది ! ఆయన వేదాంతం చెబుతారట ! అదోరకం పిచ్చి అనుకో! అయినా చూసివద్దాం!"

"ఆయన నీకెలా తెలుసు ?" సీత ఆశ్చర్యంగా అడిగింది.

"పలీవ్ చెప్పాడు ! ఓసారి నన్ను వెళ్లమన్నాడు ! ఆయన దేవుడట ! నేను దెయ్యాన్నట! నాలో వున్న దెయ్యాన్ని ఆయన వదిలిస్తారట !

రేఖ కళ్ళనిండుగా వ్యంగ్యం !

"అన్నయ్య నీకేం అపకారం చేశాడు ? వాడితో ఎందుకిలా మాట్లాడవు ?"

"మంచివాళ్లని చూస్తే నాకు భయం !" నవ్విందామె.

"యాజులుగారి దగ్గర యిలా మాట్లాడకు !"

"ఏం ? కొడతారా ?"

"ఆయన పెద్దవాడు ! వేదాలు చదువుకున్న విజ్ఞానవంతుడు !"

"అయితే యిష్టంవచ్చినట్లు మాట్లాడతాను !"

"నీతో మాట్లాడలేంబాబూ !" సీత విసుక్కుంది.

"అయితే పద ! వెళ్దాం !"

"ఇపుడే ! లేడికి లేచిందే ప్రయాణమా ? నువ్వు శ్రీనివాస్ దగ్గర ... కెళ్ళాలన్నావుగా ?"

"శ్రీనివాస్‌ని నేను మరిచిపోయినా నువ్వు మరిచిపోయేట్టు లేవు !" సీత ఉలిక్కిపడింది. ముఖాన నవ్వు పులుముకుని బయల్దేరింది.

సోమయాజులుగారు హాస్పిటలు నుంచి ఆరోజే యింటికి వెళ్ళారు.

విజయ కాలేజికి సెలవు పెట్టిందా రోజున ! ఆ వున్న ఒక్క గదిలో సామాను సర్దలేక సతమతమైపోతోంది.

"ఓ ! సీతా ! మీరా ? ! రండి ! రండి !" సీతని చూడగానే నవ్వుతూ ఎదురువచ్చి ఆహ్వానించింది.

సీత రేఖని కూడా పరిచయం జేసింది. విజయ 'సారధిగారి మరో చెల్లెలు' అనగానే అర్థంగానట్లు చూసి ఏదో అడగబోయి అనవసరమనుకుని వూరుకుంది.

"సారథంటే మీక్కోపమనుకుంటానే !" రేఖ అన్నది.

"ఆ విషయం ఎందుకులెండిపుడు ?" విజయ మాట మార్చాలని ప్రయత్నించింది.

"నాక్కూడా మహాకోపంలెండి ఆ మనిషంటే !" రేఖ విడిచిపెట్టలేదా విషయాన్ని.

"కోపానికి కారణం వుంటుందమ్మా !" సోమయాజులుగారు కళ్ళు తెరిచి అన్నారు !

"నువ్వు నిద్రపోవడంలేదా తాతయ్యా !" విజయ సీతనీ, రేఖనీ పరిచయం జేసింది.

"అమ్మా రేఖా ! నీగురించి నాకు సారధి చెప్పాడు ! విజయ గురించి నాకు తెలుసు ! మీ యిద్దరూ సారథిని అమితంగా ప్రేమిస్తున్నారమ్మా ! లేకపోతే అతనిపైన మీకెందు కింత కోపం వస్తుంది ?"

"తాతయ్యా ! నువ్వు పడుకో !" విజయ వారించింది.

రేఖ నవ్వుతూ అన్నది –

"నాకతనంటే మహాద్వేషం తాతగారూ !"

"చూడమ్మా! "ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే। సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే।" అన్నాడు కృష్ణుడు ! ఇంద్రియ విషయాల్ని గురించి చింతిస్తున్న మనుషుల్లో ఆసక్తి జనిస్తుంది ! దానివలన కోరిక పుడుతుంది ! ఆ విషయంపై ఉన్న కోరిక తీరనపుడు కోపం వస్తుంది !"

రేఖ నిర్భాంత పోయిందా సమాధానం విని.

"నాకతనిపైన రవ్వంతైనా ప్రేమలేదు!" రేఖ ఎప్పటికో అన్నది.

"తాతయ్య కదో పిచ్చిలెండి ! అస్తమానం ఆ భజనే చేస్తూంటాడు !" విజయ విసుక్కుంది.

"మరి మీరెందుకమ్మా సారధిని గురించి మాట్లాడ్డం ?" సోమయాజులుగారు నవ్వుతూ అడిగారు.

"ఓ విషయాన్ని గురించి గానీ, ఓ మనిషి గురించి గానీ మనం అత్యధికంగా ఆలోచిస్తున్నా

మంటే, మనకీ — ఆ మనిషికీ మధ్యన ఏదో అనుబంధం వున్నట్లేనమ్మా !''

''మా తాతగారెలాగూ సన్యాసులే ! మీ సారధిగారు కూడా సన్యాసులై పోయేట్టున్నారు సీతా ! ఇద్దరూ ప్రతిరోజూ గంటల తరబడి వేదాంత చర్చ చేస్తున్నారీమధ్య ! వినలేక నేను ఛస్తున్నాను !'' విజయ నవ్వుతూ అన్నది.

''అలాంటి పిరికివాళ్ళే సన్యాసులౌతారు !'' రేఖ హేళనగా నవ్వింది.

విజయ ఆమె వైపు ఆశ్చర్యంగా చూసింది.

''అన్ని సుఖాల్నీ త్యజించడం పిరికివాళ్ళకి సాధ్యంగాదమ్మా ! సారధి నన్ను మించిన సన్యాసి అయిపోయాడు ! నా కోసం, నీ కోసం, సీత కోసం మరింకెవరెవరి కోసమో బ్రతుకుతున్నాడు! తాను సుఖపడుతున్నదీ లేనిదీ అతనికి తెలియనే తెలియదేమో !''

''అదంతా నటన తాతయ్య !'' రేఖ, విజయనే చూస్తూ అన్నది.

విజయ అసహనంగా కదిలింది ఆ మాట వినగానే.

''నువ్వు నటించగలవామ్మా ! అలా !'' సోమయాజులుగారు సూటిగా ప్రశ్నించారు.

''నటించడం గొప్పకాదని నా అభిప్రాయం!''

''మొదటి నిజం సారధి నటించడం లేదన్నది ! రెండవది నటించడం చాలా కష్టం ! మరొకరి అనుభూతుల్నీ, స్వభావాల్నీ నటించడం అందరికీ సాధ్యంగాదమ్మా ! లేనిదాన్ని వున్నట్లు నటించడం మరీ కష్టం ! నీలాగా !'

''సారధిగారికి యిన్ని కష్టాలు వచ్చాయి గదా మరి ! మీరేమీ చేయలేరా తాతయ్యా !''

రేఖ ప్రశ్న విని సీత ఆశ్చర్యపోయింది.

''నేను చేయగలిగింది చేస్తున్నానమ్మా ! మరి ... నువ్వెందుకు చేయడం లేదో చెప్ప గలవా ?'' సోమయాజులుగారు ఆమెనే చూస్తూ అడిగారు.

సీత కుతూహలంగా చూసిందామె వైపు ఏం సమాధానం చెప్తుందోనని.

''నన్నేం చేయమంటారు ?''

## మూగ ముత్యాలు

''మన మధ్య మనుషులున్నారని ప్రతి క్షణం గుర్తుంచుకోవాలమ్మా ! మన కోరికలు అనంతం ! కానీ వాటి కోసం మనోనిగ్రహాన్ని పోగొట్టుకొని యితరుల్ని కూడా బాధపెట్టటం అవివేకం తల్లీ !''

రేఖ నవ్వింది విరక్తిగా.

''వస్తాను తాతయ్యా !'' ఆమె సీతవైపు చూడనేలేదు, విజయతో కూడా వెళ్తున్నానని చెప్పనూ లేదు. తిన్నగా బయటకి నడిచింది.

''రేఖా ! ఏమిటలా వుప్పెనగాలిలా రావడం! పోవడం !'' సీత వెనుకే వస్తూ అడిగింది.

''మీ అన్నయ్యని ఈ వేదాంతంతో పిచ్చివాణ్ణి చేసివేస్తున్నారు. సోమయాజులుగారు !'' ఉన్నట్టుండి సారధిపైన సానుభూతి నివర్షించిందామె మనస్సు.

''ఆయన మాటల్లో నీకు నమ్మకం కుదరలేదా ?''

''అందులో క్రొత్తేముంది సీతా ? ఎక్కడా లేని విషయమేదైనా చెప్పారా ఆయన?''

''ఈ ప్రపంచంలో వున్నది మాత్రం ఏమిటంటావ్ ? నువ్వు ... శ్రీనివాస్‌ని ప్రేమించావు ! నేనూ ... అలాంటిదే చేస్తాను ! ఈ ప్రేమ క్రొత్తదేమీగాదు ! అయినా నీ కథ నీకు వింత ! నా కథ నాకు క్రొత్త ! తీరా చూస్తే మళ్ళీ యిదే కథ మొదలవుతుంది మన పిల్లలతోకూడా ! అయినా ఆసక్తిగానే వుంటుంది! అందుకే మళ్ళీ మళ్ళీ సృష్టించబడుతోంది ప్రేమ !''

''నీక్కూడా వేదాంతం వంటబట్టింది !'' రేఖ ఏదో ఆలోచిస్తూ ఆమెని ఆపివేసింది.

* * *

సోమయాజులుగారు ఓ నెల తరువాత వేములపల్లి వెళ్ళిపోయారు.

''ఈ మహానగరంలో నాకు వూపిరాడటం లేదు నాయనా !'' అన్నారు సారధితో !

విజయ చదువు మానేస్తానన్నది. తాతగారిని ఒంటరిగా వుండనీయనన్నది.

''రాజ్యం ఒంటరిగా వుండలేదమ్మా ! అదీగాక ఆ ఏకాంత యింట్లో నువ్వూ ఏకాకి వైపోతావు !''

''ఒకప్పుడు మాత్రం మనకెవరున్నారు తాతయ్యా !'' సారధి ఆ మాటల్లో ధ్వనించిన విషాదానికి చలించిపోయాడు.

''అయినా యీ స్థితికి నిన్ను పంపించ లేనిలా !'' విజయ మొండికెత్తింది !

''విజయ ప్రైవేటుగా యింటరు కట్టుకో వచ్చు తాతయ్యా ! ఆ ఏర్పాట్లన్నీ నేను చూస్తాను !'' సారధి చెప్పాడు.

''నేనూ అదే అనుకొన్నాను తాతయ్యా !''

విజయ సారధి వైపు చూడలేదు. కానీ అతని మాటని కాదనలేకపోయింది. అప్పటివరకు ఆమెకా వూహే తట్టలేదు. సారధిని మనస్సులోనే అభినందించింది. తాతగారి పుణ్యమా అని ఆమెకు సారధి పైన కలిగిన కోపం చాలావరకు తగ్గిపోయింది ! అదీగాక అతడు ప్రతిరోజూ వచ్చి యోగక్షేమాలడిగి వెళ్ళడం, రాజ్యానికి కావలసిన పుస్తకాలని సంపాదించిపెట్టడం ఆమె మనస్సుని కాస్త చల్లబరచాయి. అతనితో మాట్లాడాలంటే మనస్సు ఒప్పుకోదు. కానీ అతడు ఏదైనా చెబుతూంటే వినాలనిపిస్తోంది ! రైలెక్కుతూ సోమయాజులుగారు కళ్ళనీళ్ళతో అడిగారు — ''సారధీ ! నీవుకూడా రారాదా నాయనా !'' ఆ కన్నీటిని చూసి సారధి మనస్సు కరిగిపోయింది. కాదనలేకపోయాడు.

విజయ, తాతగారితో ఏదో అనబోయి ఆగిపోయింది. సారధి తనవైపే చూస్తున్నాడని గమనించి మౌనంగా వుండిపోయింది.

ఆ వూరు వూరంతా కదిలి వచ్చింది సోమయాజులుగారిని చూడటానికి.

''మీకు రావలసిన జబ్బు కాదు బాబూ ! ''

అని కన్నీళ్ళు పెట్టుకున్నారు ఎందరో !

''ఈ కుర్రవాడు ... మీ బంధువులా ?''





# మీ జీవితంలో ఎంతో కష్టపడి పైకి వచ్చారు మీరు.

## అందుకే మేము మీ కోసమే డిజైను చేశాం ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటి అతిసులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్ క్రొత్త బిఎస్ఎ డీలక్స్.



బిఎస్ఎ డీలక్స్ యొక్క సొగసైన సన్నటి బ్యారల్ హబ్—ఇవి అత్యంత నాణ్యమైన, దృఢమైన కేస్ కప్స్ కలిగి సైకిల్ మెత్తగా, హాయిగా నడిచేలా చేస్తాయి



ఎక్కువ సులభంగా తిరగడానికి వీలునిచ్చే చక్కటి గొట్టపు ఫోర్క్ దీనితో బిఎస్ఎ డీలక్స్ తొక్కడం నిజంగా సుఖకరం.



మీ వీపు మరియు పాదాలకు తక్కువ కష్టం కల్గించి ఎక్కువ హాయి నివ్వడానికై బిఎస్ఎ డీలక్స్ ఫ్రేము యొక్క కోణం ప్రత్యేకంగా డిజైను చేయబడినది.



మీరు జీవితంలో ఎంతో దూరం వచ్చారు. ఎంతో కష్టపడి మరీ పైకి వచ్చారు. అందుకే మీకు కావాలి అత్యుత్తమమైనది అదే బిఎస్ఎ డీలక్స్. మీరు పనికి వెళ్ళడానికోసం ప్రత్యేకంగా డిజైను చేయబడి అతి సులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్. ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటిది. ఇంతకుముందు ఎన్నో ఇతర సైకిళ్ళను తొక్కివుంటారు మీరు. అందుకే వ్యత్యాసం స్పష్టంగా అనుభవించగలరు. మీ పాదాలు, మీ చేతులు, మీ వీపు .. మీ శరీరపు ప్రతి భాగం చెపుతుంది... ఇంత సులభమైన సుఖకరమైన సైకిల్‌ను మీరు ఇదివరకు ఎప్పుడూ తొక్కలేదని

పచ్చ మరియు నలుపు రంగులలో లభ్యం

## క్రొత్త బిఎస్ఎ డీలక్స్– సఫలత-మార్గంలో మీకు సుఖకరమైన తోడు.





**BSA Deluxe**

Rediffusion-TI-1911 TL

స్త్రీ మనోభావాలకు
అందమైన
భాషలు ఎన్నెన్నో.

**అందులో విమల్ ఒకటి.**




చీరలు
జార్జెట్ • షిఫాన్
వాయిల్ • టిష్యూ • క్రేప్ • సి

కొందరు ప్రశ్నించారు. ఆయన తలూపారు ! విజయ తాతగారి వైపు వింతగా చూసింది.

విజయ అతనితో మాట్లాడనేలేదు ఆ రోజంతా !

"నన్ను మీరు క్షమించలేరా విజయా ?"

సారథి మరునాటి మధ్యాహ్నం అడిగాడు. అతడూ ఆమెతో మాట్లాడ్డం అదే మొదటిసారి.

"మిమ్మల్ని తాతగారితో బాటు రమ్మని అడగమన్నది నేనే !"

ఆమె 'నాకేమీ కోపంలేదు, క్షమించేశానని' పరోక్షంగా చెప్పింది.

" మరి నాతో మాట్లాడ రెందుకని ? "

సారథి మనస్సున ఆనందం నిండిపోయింది.

"ఏం మాట్లాడమంటారు ?"

సారథి మనస్సు తడబడి పోయింది ! మనస్సుకి వున్న దిగులంతా కరిగిపోయినట్లనిపించింది.

"నన్నెపుడు వెళ్లనిస్తారో తెలుసుకో వచ్చా ?"

"ఆ సంగతి తాతయ్య నడగాలి "

"తాతయ్య అసలు వెళ్లనే వద్దంటారు!"

"అయితే ! వుండవలసిందే !" విజయ ఏ భావాన్నీ వ్యక్తం చేయకుండా అన్నది.

సారథి మనస్సు మాత్రం ఆ జవాబుతో వేయి అర్థాల్ని వెతుక్కుంది !

తీయ తీయని స్వప్నాలకి తేలిపోయింది.

"మీ కిష్టం లేదనుకుంటాను నేనుండడం !"

"మధ్యన నేనెవర్ని ? తాతయ్య మీ కావ్త బంధువు !"

"మరి...మీరు ?... "

"నేను విజయని !" ఆమె పెదవులపైన నవ్వు చిలిపిగా చిందులు వేసింది —

"నిజం చెప్పారు !" అతని మనస్సుకి పట్టిన విషా అప్పటికి దిగిపోయింది.

"నేను మీకన్న పెద్దదాన్నంటారా ?" ఉన్నట్టుండి విజయ గంభీరంగా ప్రశ్నించింది.

"భలే వారే ! అదేమీ గాదు !"

"మరి నన్నెందుకిలా మన్నిస్తున్నారు !"

ఒక్క క్షణం అతడి వూహలు పులకించి పోయాయి ఆమె అంత చేరువగా వచ్చినందుకు. కానీ వెంటనే ఆ వూహల్ని అణచివేశాడు.

"నా మాటని మీరు మన్నిస్తే తప్పకుండా మీ కోరికని నెరవేరుస్తాను !"

"నా కర్థం కాలేదు ! మీరన్నది !"

"తాతయ్యా... నేను వెళ్ళేలోపలే ... మీ పెళ్ళి విషయం తేల్చమని అన్నారు ! ఓసారి మీకు వ్రాసాను! నా స్నేహితుడొకడున్నాడు ! బ్యాంకుకి ఆఫీసరు ! రమ్మని వ్రాసాను ! తాతయ్యే వ్రాయమన్నారు ! ఆయన యీ దిగులుతో కృశించి పోతున్నారనిపిస్తోంది !"

క్షణంపాటు విజయ, సారథినే చూస్తూండి

# మూగ ముత్యాలు

పోయింది ! ఆ తరువాత కళ్ళు వాల్చుకొని అన్నది.

"నాతోపాటు, తాతయ్యని కూడా భరించగల వాళ్ళయితే నాకభ్యంతరం లేదని చెప్పండి ! అయినా, తాతయ్య కింత శత్రువు నెప్పుడయ్యాను నేను ? మీతో చెప్పుకుంటున్నాడన్నమాట మనస్సులోని దిగుళ్ళని ! అయితే మీరు నాలుగు రోజులుంటున్నారు గదా ?"

"వాడికసలే సిగ్గు ! మీతో మాట్లాడ్డానికి గూడా భయపడిపోతాడు ! నేను వుండక తప్పదు. లేకపోతే... వాడు !"

"ఎవరి గురించి మీరనేది ?"

"నేను చెప్పింది మీరు వినలేదా ? నా స్నేహితుడొకడు మిమ్మల్ని ... చూడ్డానికి వస్తున్నాడు !"

## చిరంజీవులు

కాలం కొలువుకి
రెక్కలమ్ముకున్న
క్షణాలు నిమిషాలు
గంటలు రోజులు
వారాలు పక్షాలు
మాసాలు వత్సరాలు
దశాబ్ద శతాబ్దాలు
వగైరా వగైరాలు
రిటైర్మెంటూలేని
శాశ్వత ఉద్యోగులు.

— మాధవరపు కృష్ణ

"ఓహో ! అదా సంగతి ! అదెలాగూ జరిగేది గాదులెండి !"

"ఏం ? ఎందుకని ? వాడు ... ఎంతో సహృదయుడు ! మీ సమస్యల్ని అర్థం చేసుకోగలడు !"

"మీ కర్థంకాలేదా మా సమస్యలు ?" విజయ సూటిగా అడిగింది.

"అర్థమయ్యాయి! కానీ...నేను...నాకు... అంత అదృష్టం లేదు !" అతని గుండెల్లోని అనురాగం విలపించిందతని మనస్సు !

"మీ మూలానా ... మా కెంత నష్టం జరిగిందో తెలుసా ? నా గురించి ఎన్నెన్ని అపవాదులు బయల్దేరాయో మీరూహించగలరా ?

"నాకూ యిద్దరు చెల్లెళ్ళున్నారు ! వాళ్ళూ యిలాంటి సమస్యలతోనే నలిగిపోతున్నారు ! వాళ్ళని కాదని ... నా సుఖం నేను చూసుకోలేను! క్షమించండి ! ఇంతకు మించి వివరాలడగవద్దు !"

నా మూలాన ... మీకు చాలా బాధ కలిగింది ! నా మనస్సందుకే రాత్రింబవళ్ళూ ... మీ గురించే ... ఆలోచిస్తోంది ! ఎలా తాతయ్య మనసుకి వున్న దిగులుని పోగొట్టగలనా అని చూస్తున్నాను !"

"మీకున్న బాధంతా తాతయ్య గురించేనా?"

విజయ అతని గుండెల్లోని అనురాగాన్ని ప్రశ్నించింది.

"మీరూ, తాతయ్యా ...ఇద్దరూ నాకు... సమానమే !"

"నన్ను కూడా ముసలిదాన్ని చేసి వేశారన్న మాట !"

అతనా పరిహాసానికి నవ్వలేకపోయాడు.

"మీకు తాతయ్యతో మాట్లాడ్డమే మహా యిష్టం అని తెలుసులెండి ! వెళ్ళండి ! మీ వేదాంత చర్చకి టైమయ్యింది !" ఆమె లోనికి వెళ్ళిపోయింది.

అతడక్కడే నిలబడిపోయాడెంతో సేపటి వరకు.

"విజయా ! శశిరేఖ గురించి వింటే ... నువ్వు నన్ను కన్నెత్తికూడా చూడవేమో ! తాతయ్య మనస్సులో ఏం వుందో చెప్పడంలేదు ! కానీ ఆయన మాత్రం ... నన్నెలా స్వీకరిస్తారు? నీ కోసం నేనిలాగే వుండిపోతాను ! నీవు ... మాత్రం జీవితంలో ఏకాకిగా మిగిలి పోకూడదు! విజయా! వద్దు! నా పైన ఆశల్ని అల్లుకోనీయకు నీ మనస్సుని ! నిన్నెలాగైనా ఒప్పించి తీరుతానులే ! ప్రతాప్ చాలా మంచి వాడు. నిన్ను అన్నివిధాలా సుఖపెట్టగలడు ! నీ అందానికి సరిపోతాడు వాడైతే !" సారథి మనస్సున లేచి పడుతూన్న వూహల్ని నిర్దాక్షిణ్యంగా అణచివేసాడు. అనురాగం విలపిస్తూంటే నిశ్శబ్దంగా వింటూండిపోయాడు. అతని కనుకొలకుల్లో అశ్రుబిందువులు అతనిలోని అనురాగాన్ని ఓదార్చాయి. మూడోరోజునే, సారథి స్నేహితుడు ప్రతాప్ వచ్చాడు. సోమయాజులు గారికి అతను నచ్చాడు.

"సారథీ! సాయంత్రం వర్జ్యం లేదు ! అమ్మాయికేమైనా కావాలేమో అడిగిచూడు ! చీరలవీ వున్నయోలేదో ? లేకపోతే రాఘవుల్ని పంపించి తెప్పించుదాం !" అన్నారాయన.

"విజయా ! మిమ్మల్ని తాతయ్య పిలుస్తున్నారు !" సారథి అడగలేక అలా తప్పించుకొన్నాడు.

"నాతో యుద్ధం చేస్తుందయ్యా ! బాబూ ! నీవే అడుగు !" సోమయాజులుగారు కళ్ళు మూసుకునే చెప్పారు.

విజయ వంటింట్లోనుంచి బయటకే రాలేదు అతని పిలుపు విన్పించినా ! సారథే వెళ్ళాడు.

"వాడు... అదే ప్రతాప్ వచ్చాడు... విజయా! సాయంత్రం శుభ ఘడియలున్నయట! అప్పుడు..."

"చూడమంటారా అతణ్ణి ! ఎందుకలా తడబడిపోతారు ? ఈ నాలుగు మాటలూ



# డాక్టర్ సలహాలు



## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### ఆర్. ఆర్. డి. – నిర్మల్

నా వయస్సు 23 సంవత్సరములు. నేను ఇంకా పెళ్ళి చేసుకొనలేదు. నాకు ఒక అరచేతి చిటికెనవ్రేలు వెనుక భాగంలోనూ, ఎడమకాలు మోకాలు క్రింద పిక్కభాగములోనూ రూపాయ నాణెమంత భాగము స్పర్శ అంతగా లేదు. ఇది నా భవిష్యత్తులో లెప్రసీకి దారి తీస్తుందేమోనని చాలా భయముతో ఎవ్వరికీ చెప్పలేదు.

★ లెప్రాలజిస్టులకి చూపించి రోగనిర్ధారణ చేయించుకోవలసి ఉంటుంది. స్పర్శ ఉన్నదీ లేనిదీ వైద్యులు తీర్మానించవలసి ఉంటుంది. భయపడి రోగాన్ని దాచుకొంటే ముదిరిపోయే అవకాశం ఉంటుంది.

### వి. యస్. పి. – గుత్తి

మానవుని మేధాశక్తి అనేది వాతావరణ పరిస్థితులమీద ఆధారపడి వుంటుందా ?

'హిప్నాటిజం' ద్వారా మానసిక వ్యాధులను నయము చేయవచ్చా ?

★ పెద్దల అలవాట్లు, స్నేహితుల ప్రభావం అనే వాతావరణం మీద మానవుని మేధాశక్తి తప్పక ఆధారపడి ఉంటుంది.

కొంతవరకూ హిప్నాటిజం ద్వారా మానసిక రోగాలను నయం చేయవచ్చును.

### యం. కె. – జమ్మికుంట

నా వయస్సు 34 సంవత్సరములు. నాకు 'డయాబెటిస్' వచ్చింది; త్రాగుడు, తీపి తినటం అలవాటు లేదు, టీ గూడా స్వల్పంగా తీసుకుంటాను. ఈ వ్యాధి మా కుటుంబములో గూడా ఎవ్వరికీ లేదు. ఇది ఎందుకు వస్తుంది ? ప్రమాదము ఏమైనా వున్నదా ? నయమవుతుందా ?

★ డయాబెటిస్ రావటానికి పేంక్రియస్ గ్రంధిలో ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గిపోవటమే కారణం అవుతుంది. ఆహారవిషయంలో తగిన జాగ్రత్త తీసుకొంటూ, శరీర వ్యాయామం చేస్తూ తరచూ వైద్యులవద్ద పరీక్ష చేయించుకోంటూవస్తే, ఈ రోగంవల్ల ప్రమాదమేమీ ఉండదు. పై జాగ్రత్తలవల్ల ఈ రోగం మూలంగా అవాంతరాలూ ఏర్పడవు.

### ఎమ్. జె. పి. – కర్నూలు

నా వయస్సు 20 సంవత్సరములు. నాకు టీ త్రాగే అలవాటు బాగా వున్నది. రోజుకి 4, 5 మార్లయినా త్రాగుతాను. ఇలా త్రాగటం వలన ఏమైనా ప్రమాదమున్నదా ?

★ టీ, కాఫీ ఎక్కువగా తాగటంవల్ల ఆరోగ్యానికి హానికరమే! కఫీన్ అనే ఆల్కలాయిడ్ మూలంగా ఆకలి తగ్గిపోయే అవకాశం ఉంటుంది.

### కె. పి. – అబ్బరాజుపాలెం

నాకు బొటనవేలి గోళ్ళు పుచ్చుతున్నవి. దీనికి ఏమందులు వాడాలి ? తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి ?

★ ఇలా జరగటం ఫంగస్ ఇన్‌ఫెక్షన్ రావటం మూలంగానే. ఎక్కువగా నీళ్ళలో పని చేసేవారికి ఈ రోగం వచ్చే అవకాశం ఎక్కువ.

ఫల్విన్. ఎఫ్. మాత్రలు రోజుకి ఆరువంతున వరుసగా 20 రోజులపాటు వాడండి. చీము ఉన్నట్లు అనుమానంగా ఉంటే యాంటీ బయాటిక్ మందులను వైద్యుల సలహామేరకు వాడవలసి ఉంటుంది. నీళ్ళలో చేతులు కాళ్ళు పెట్టటం మానవలసి ఉంటుంది. అలా చేయవలసి వస్తే చేతులకి రబ్బర్ గ్లవ్స్ వాడటం మంచిది.

### ఎస్.ఆర్.ఆర్. – జగ్గయ్యపేట

నా వయస్సు 29 సంవత్సరములు. నాకు వివాహమయి 6 నెలలయినది. అంతకుముందు కొంతమంది స్త్రీలతో సంబంధమున్నది. నేను మూత్ర విసర్జన చేయునపుడు చాలా మంటగా వుంటోంది. తరచు మూత్రము వస్తున్నట్లు వుండటం, 4, 5 బొట్లు పడటం జరుగుతుంది. మరియు నేను నా భార్యతో కలిసిన తరువాత కడుపులోనెప్పి అని బాధపడుతోంది. మా ఇద్దరి జీవితము ఇలా పాడయిపోవలసినదేనా? మాకు పిల్లలు పుట్టే అవకాశం వున్నదా ?

★ మీరిరువురూ వైద్యులచేత పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది—గొనోరియా రోగం ఉండటంవల్ల పై లక్షణాలు వస్తాయి. మూత్రం విసర్జించే నాళం (యూరిత్రా)లో అవరోధం ఏర్పడటమే మూత్రం బొట్లు బొట్లుగా రావటానికి కారణం. శస్త్ర వైద్యులకి చూపించి చిన్న ఆపరేషన్‌ద్వారా అవరోధాన్ని తొలగింప చేసుకోవచ్చును. గొనోరియాకిగాను పెన్సిలిన్‌వంటి మందులను టెస్ట్‌డోస్ తర్వాత వైద్యుల పర్యవేక్షణలో వాడవలసి ఉంటుంది. స్త్రీల జననేంద్రియ భాగాలలో రోగాలు లేనప్పుడు పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది. ★

---

చెప్పడానికి? తాతయ్య యీమధ్య రాయబారాలు పంపుతున్నాడు ! వాళ్ళమ్మతోకూడా దెబ్బలు తినలేదట పాపం ! నాతో తప్పవన్పిస్తోంది !''

''పూలూ... యింకా... ఏమైనా కావలసి వుంటే రాఘవులికి చెప్పి పంపమన్నారు !''

''ఏం ? మీరు నాకు పూలు తెచ్చిపెట్ట లేరా ?''

విజయ ప్రశ్న అతని మనస్సులోని అనురాగాన్ని మేల్కొల్పింది !

''నాకీ పూలు... అంతగా తెలియదుగదా ! మరి !''

''అయితే నాకేమీ అక్కర్లేదని చెప్పండి!''

''పోన్లే ! రాఘవుల్ని తీసుకుని నేనే వెళ్తాను ! ఏమేం కావాలో చెప్పు !'' అప్రయత్నంగానే అతడామెను ఏకవచనంలో సంబోధించాడు.

అతడా విషయం గమనించనేలేదు. అతని మనస్సు ఓ విచిత్రమైన బాధతో సతమతమైపోతుంది !

విజయ కళ్ళు ఆనందంతో రెపరెపలాడాయి.

''ఏమేంకావాలో చెప్పండి !'' విజయ తెలియనట్లు అడిగింది.

''పూలు... చీరలు... కావలిస్తే తీసుకోమన్నారు తాతయ్య !''

''ఆడవాళ్ళు చీరల్ని వద్దనడం మీరెపుడైనా విన్నారా ? ఎలాగూ మీరే వెళ్తున్నారు గనుక ఓ కంచి పట్టుచీరకూడా తీసుకురండి !''

''పల్లెటూళ్ళో... పట్టుచీరలు దొరకవేమో !''

''సర్లెండి ! అయితే వున్నదానితోనే సరిపెట్టుకుంటాను !''

సారథి రాఘవుల్ని మల్లెపూలు తీసుకు రమ్మని తోటదగ్గరకి పంపించాడు.

(ఇంకా వుంది)

## ఎర్ర(శమలో విస్మయం కలిగించిన "(తిశూలం"!

కృష్ణంరాజు హీరోగా కె. రాఘవేం(దరావు దర్శకత్వంలో ఉత్తమాభిరుచి, ఉన్నతమైన ఆశయాలుగల కె. మురారి నిర్మించిన యువ చి(తవారి "(తిశూలం" చక్కని (స్కీన్‌ప్లే, ఉదాత్తమైన పా(తపోషణ, (శేష్ఠమైన తదితర సాంకేతిక విలువలతో అద్భుతంగా రూపొందింది గనుక అన్ని కేం(ద్రాలలోనూ వసూళ్ళలో రికార్డు సృష్టిస్తుందని మ(ద్రాసులో ఆ చి(త్రాన్ని చూసిన వారందరూ ఎంతో ఆశించారు. విడుదలైన అనేక కేం(ద్రాలలోనూ మంచి టాక్ వచ్చినా వసూళ్ళు ఆశించిన మేరకు రాలేదు. విచి(తమేమిటంటే విశాఖపట్నంలోని శరత్ థియేటర్‌లో ఈ చి(తం రెగులర్ షోలతో 107 రోజులు, ఆ తర్వాత షిఫ్ట్‌మీద 200 రోజులు పూర్తి చేసుకుంది. విశాఖజిల్లాలోని ఇతర కేం(ద్రాలలోకూడా అమోఘమైన రాబడి వచ్చింది. మరి, మిగతా కేం(ద్రాలలో ఇంత విజయవంతంగా ఎందుకు (పదర్శింపబడలేదు? (పేక్షకుల అభిరుచులలో ఒక జిల్లాకూ, మరితర జిల్లాలకూ ఇంత తేడా ఉంటుందా? ఇది ఎవరికీ బోధపడని విషయమైంది.

కె. మురారి త్వరలో దాసరి నారాయణరావు రచన, దర్శకత్వంలో (పారంభించే చి(తంలో శోభన్‌బాబు హీరో.



"ఇట్లా ఫొటో దిగి నాకు అప్పు ఇచ్చినవాళ్లందరికీ పంపించ దల్చుకున్నానయ్యా!"



'శ్రీరంగ నీతులు'లో విజయశాంతి, అక్కినేని

## "శ్రీరంగ నీతులు"లో పాతపురాణం

రాజేష్ (ఎ.ఎన్.ఆర్), తన తండ్రి నారాయణమూర్తి (సత్యనారాయణ)తో ఏదో విషయం గురించి తీవ్రంగా చర్చిస్తుంటే, తల్లి జానకి (పండరీబాయి) పళ్ళెంలో ప్రసాదం తీసుకొచ్చింది. "ఏమిటండీ ? ఏమిటి గొడవ ?" అంది.

"చెప్పనా ?" అని తండ్రినడిగాడు రాజేష్. నారాయణమూర్తి ఇబ్బందిగా ముఖం పెట్టాడు.

"చెప్పరా... భయమెందుకు ?" అంది జానకి.

"నాన్నకూ, నాకూ ఒక విషయంలో అభిప్రాయభేదం వచ్చింది... నీకు విశ్వామిత్రుడు, మేనక కథ తెలుసుగా ? అందులో తప్పు ఎవరిదీ అని."

"విశ్వామిత్రుడిదే తప్పు. దొంగ సన్యాసి. మేనకదేముంది పాపం— దేవేంద్రుడు పంపితే వచ్చింది," అంటూ జానకి ప్రసాదం భర్తకిస్తూ "విశ్వామిత్రుడి కెట్టాబుద్ధి లేదు ? దొంగసన్యాసి ముక్కు మూసుకుని జపాలు చెయ్యగానే సరా ? ఈ దొంగభక్తులందరూ ఇంతే. ఆడది కనబడగానే వళ్ళు తెలియదు," అంది.

నారాయణమూర్తి ఒక్క గుటక వేసి, "అలా తిట్టకే. విశ్వామిత్రుడు తర్వాత ఎంత బాధపడ్డాడో నీకు తెలీదు," అన్నాడు.

"తర్వాత ఎంత బాధ పడితే ఎవరికి కావాలండీ— కన్నకూతుర్ని అనాథగా అడవుల్లో పారేసి పోయాక ?"

రాజేష్ ప్రసాదం అందుకుంటూ, "అనాథల్ని దేవుడు ఆదుకుంటాడమ్మా ! శకుంతలని ఒక మహారాజు వచ్చి పెళ్ళిచేసుకోలా ?" అన్నాడు తను లక్ష్మిని పెళ్ళి చేసుకుంటానని తండ్రికి సైగచేస్తూ.

"రామచంద్రా ! రఘువేంద్రా !" అంటూ నారాయణమూర్తి ఎందుకు కలవరపడ్డాడో జానకికి అర్థం కాలేదు.

రాజేష్ నవ్వుకున్నాడు.

శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పణలో వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మించిన అన్నపూర్ణ స్టూడియోస్ "శ్రీరంగనీతులు" చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు. కొడాలి అంజనేయచౌదరి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

## "సింహపురి సింహం"లో అంతరంగ ఘోష

"ఎక్కడుందిరా న్యాయం — ఇటు
రాళ్ళల్లో మూల్గుతుంది
ఎక్కడుందిరా అన్యాయం — అటు
రాజ్యాలు ఏలుతుంది.
నెత్తురు పీల్చేదొకడైతే, అపనిందలు
మోసేదొకడా ?
ముగువల శీలం దోచుకునే మృగాలకేమో
నివాళులా ?
ఉన్నాయెందుకు చట్టాలు ? బలమున్న
వాళ్ళకవి చుట్టాలు.
పుణ్యభూమిరా మనది. ధర్మానికి ఇక్కడ
సమాధి ! సమాధి."

విజయశాయి ఫిలిమ్స్ "సింహపురి సింహం" చిత్రం కోసం చిరంజీవిమీద పై గీతాన్ని చిత్రీకరించాక డైరెక్టర్ కోడి రామకృష్ణ "ఈ చిత్రంలో చిరంజీవి తండ్రీ కొడుకులుగా ద్విపాత్రలు ధరిస్తున్నారు. ఇప్పుడాయన తండ్రి రాజశేఖరం గెటప్‌లో ఉన్నారు. తోడబుట్టినవాడే తోడేలుగా మారి తన కుటుంబాన్ని, తన ప్రజల్ని సర్వనాశనం చేస్తే, ఏ మనిషి సహిస్తాడు ? తన కన్నకొడుకునే తనమీదకు ఉసిగొలిపి తమాషా చూసే కుసంస్కారి కుయుక్తులకు బలై, ఎక్కడో అడవుల్లో అజ్ఞాతవాసం చేయవలసి వస్తుంది ఈ రాజశేఖరానికి. తన రక్తమే తనకు ఎదురుతిరిగినప్పుడు ఆ వీరయోధుని అంతరంగం అలా ఘోషించింది," అని వివరించారు. కె. ఎస్. నారాయణశెట్టి సమర్పించే ఈ చిత్రానికి మహేష్, గోపీనాథ్ నిర్మాతలు.

ప్రతాప్‌పోతన్, రాజ్యలక్ష్మి 'ప్రజారాజ్యం'



## సినిమా

### నవత ఆర్ట్స్ "జడగంటలు"

"అందమైన కురులకు మరింత అందాన్నిచ్చేవి జడగంటలు... వీటిని జడకుప్పెలనీ, జడకుచ్చులనీకూడా కొన్ని ప్రాంతాలవారు అంటారు. ఈ జడగంటల గుసగుసలు యువ హృదయాలలో తీయని ఊహలు కలిగిస్తాయి; అలజడినీ కలిగిస్తాయి. అందరి హృదయాలపై పన్నీటిజల్లు కురిపించే ప్రణయగాథ 'జడగంటలు'. కథకు అనుగుణంగా గోదావరి పయ్యారాన్ని, సౌందర్యాన్ని కొత్త కోణాల్లో చూపించడంకోసం పోలవరం, పట్టిసీమ ప్రాంతాలలోని చక్కని లొకేషన్స్‌లో ఆగస్టు 15 నుంచి సెప్టెంబర్ 5, అక్టోబర్ – నవంబర్‌లలో 1–10 తేదీల మధ్య మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తి చేస్తాం," అన్నారు నిర్మాత ఎన్. కృష్ణంరాజు. రంగనాథ్, ప్రభ, సురేష్, విజయశాంతి, 'శుభలేఖ' సుధాకర్, సుత్తి వేలు ప్రభృతులు పాత్రధారులు. వేటూరి గీతాలకు పుహళేంది స్వరకల్పన చేశారు. ఆర్. కె. రాజు ఛాయ, సూరపనేని కళాధర్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పుతో పర్వతనేని సాంబశివరావు దర్శకుడు. "డిసెంబర్‌లో విడుదలకు సిద్ధమవుతుంది," అని నిర్వహణ బాధ్యతలు వహించే ఎన్. అచ్యుత రామరాజు చెప్పారు.



జయసుధ, రాధిక 'దేవి – శ్రీదేవి'



'చట్టానికి సవాల్'లో మాధవి

## హిందీ చిత్ర విశేషాలు!

★ "శుక్రవారం 13వ తేదీ" అనే భయానక హిందీ చిత్రాన్ని ఎస్. యు. సయ్యద్ నిర్మిస్తాడు. ఈ చిత్రం ఆద్యంతం వర్షంలో చిత్రీకరింపబడుతుందట.

★ వీడియో ప్రదర్శనలపై చిత్ర పరిశ్రమ దండయాత్ర సాగిస్తున్న తరుణంలో నటుడు సుజిత్‌కుమార్ బొంబాయి శివార్లలో ఒక 'వీడియో స్నాక్ బార్'ను ప్రారంభించాడు.

★ గాంధీ జన్మస్థలం పోర్‌బందర్‌లో "గాంధీ" చిత్రం నాలుగు వారాలకు మించి ప్రదర్శింపబడలేదు.

★ ఇంతవరకు తక్కువ బడ్జెట్‌తో చిత్రాలు తీసే రాజశ్రీ సంస్థ ఒక చిత్రాన్ని రాజేష్‌ఖన్నాతో నిర్మించబోతోంది.

★ పలు హిందీ చిత్రాలకు గీతాలు రాసే గౌహర్ కాన్‌పురి బొంబాయిలో తరచు లోకల్ ట్రయిన్‌లలో ప్రయాణం చేస్తుంటాడు. ఐతే, కంపార్ట్‌మెంట్‌లలో ఎన్నడూ కూర్చోడు. ఎందుకని అడిగితే, "నేనిలా నిలుచొని ప్రయాణం చేస్తుంటేనే ఎన్నో ఊహలొస్తుంటాయి," అంటాడట.

★ ఇటీవల మన భారత క్రికెట్ జట్టు లండన్‌లో ప్రుడెన్షియల్ కప్ గెలుపొంది, విజయోత్సాహంతో మనదేశానికి తిరిగి వస్తున్న సందర్భంలో వారిపై కొన్ని దృశ్యాలు చిత్రీకరింపబడ్డాయి. ఈ దృశ్యాలు "కభీ అజ్నబి" [ఈ చిత్రంలో సందీప్‌పాటిల్ హీరో]లో జొప్పించబడతాయి.

★ జూలై 6న మహారాష్ట్ర శాసనసభలో మధుదియోల్కార్ (బిజెపి) అడిగిన ఒక ప్రశ్నకు గృహశాఖామాత్యులు శ్రీ విలాస్‌రావ్ దేశ్‌ముఖ్ సమాధానమిస్తూ, బొంబాయిలో పోలీసులు వశం చేసుకున్న 'బ్లూ ఫిలిమ్'లను చూడ్డానికి తనకేం ఆశేపణ లేదని తెలియజేశారట.

★ దాసరి దర్శకత్వంలో హిందీలో తయారయ్యే "బొబ్బిలిపులి" చిత్రంలో జితేంద్ర సరసన జయసుధ నాయిక.

ఈ రోజు
మంచి రోజనే
భావనలో
మధుర స్వప్నాలేవేవో

# మఫత్‌లాల్ బట్టలతో అనుక్షణం తీరేను తీయని కోరికలవేవో.

సరదాగా, సున్నితంగా హాయిని గొల్పేలా బట్టలు—పాలియెస్టర్, పాలియెస్టర్ బ్లెండ్ లలోనే గాక కాటన్ లలో కూడా—క్షణక్షణం, అనుక్షణం, రోజూ, ప్రతిరోజూ మిమ్మల్ని మరింత అందంగా రూపొందించ గల రంగుల్లో, నేతలలో, డిజైన్లలో.

**మఫత్‌లాల్ ఫ్యాబ్రిక్స్**



MF-125






'ఉక్కు మనిషి'లో కృష్ణంరాజు, రాధిక

# "లంకెబిందెలు"లో పాపయ్య పాపాలు

బడి... పాపయ్య మేస్టారు (అల్లు రామలింగయ్య) గుర్రుపెడుతూ నిద్రపోతున్నాడు టేబుల్ మీద కాళ్ళుచాపి. రమ (జయసుధ) మెల్లగా వచ్చి, ఒక పుల్లతో అతని చెవిలో పొడిచింది.

పాపయ్య ఒక్కసారిగా వులిక్కిపడి లేచి కూర్చున్నాడు. "నువ్వా, అమ్మాయ్! ఏ తేలో జెర్రో చెవిలోకి వెళ్ళిందనుకున్నాను."

"సరేగాని, మావయ్యా! ఇదేనా చదువు చెప్పే పద్ధతి ?" అంది రమ.

"ఎవరికి చెప్పనమ్మా ? ఒక్క పిల్లగాడిదనైనా ఈ ఊళ్ళో పెద్దలు బడికి పంపిస్తేగా?"

గంగ, నళిని 'ప్రేమ సాగరం'లో



"ఉన్నట్టుండి ఇన్‌స్పెక్టరు వచ్చాడనుకో. గబగబా ఊళ్ళోకి పరుగెత్తుకెళ్ళి, ఎక్కడెక్కడ గోలీలు ఆడుకునే పిల్లల్ని వెతికి పట్టుకుని, తలో పావలా డబ్బులిచ్చి కూర్చోపెట్టడం. ఇన్‌స్పెక్టర్ కాఫీ తాగి వెళ్ళిపోయాక..." అని రమ పూర్తి చేసేలోగా రమేష్ అనే కుర్రాడు "ఇచ్చిన పావలా లాగేసుకుని, చేతిలో ఒక

'మా ఇంటికి రండి'లో





పిప్పరమెంటు పెట్టి తరిమెయ్యడం !" అంటూ తుర్రుమన్నాడు.

"ఒరే... ఒరే !" అంటూ పాపయ్య ఆ కుర్రాడి వెంటపడ్డాడు.

రమ నవ్వుతుంది.

కానూరి రంజిత్‌కుమార్ నిర్మించే రంజిత్ క్రియేషన్స్ "లంకె బిందెలు" చిత్రానికి విజయనిర్మల దర్శకురాలు.

## శ్రీ శరత్ ఆర్ట్స్ చిత్రం
## "కోటీశ్వరుడు"గా పేరు మార్పు

"లోగడ మా చిత్రం పేరు "దొంగ కృష్ణుడు" అనుకున్నాం. కాని, కథకు 'కోటీశ్వరుడు' పేరే అనుగుణంగా ఉంది గనుక 'కోటీశ్వరుడు' పేరునే ఖాయంచేశాం," అన్నారు ప్రాతినిధ్యుడు టి. ఆర్. శ్రీనివాస్. ఈయనా, పి. హెచ్. రామారావు నిర్మించే ఈ చిత్రానికి ఆగస్ట్ 1న తొలి గీతం ధ్వని ముద్రితమైంది. ఎ. ఎన్. ఆర్., సుజాత, జగ్గయ్య, శరత్‌బాబు, రంగనాథ్, నాగేష్, మాడా, సూర్యకాంతం, రాజసులోచన, కొత్త నటి ప్రమీల తారాగణం.

ంంంంంంంంంంంంంంంంంంంంంంంంంంంంం

కోడి రామకృష్ణ, సుహాసిని



భీసెట్టి లక్ష్మణరావు కథకు ఆత్రేయ మాటలు రాశారు. సి. నారాయణరెడ్డి, ఆత్రేయ, వేటూరి, రాజశ్రీ గీతాలకు చక్రవర్తి స్వరకర్త. నవకాంత్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, రవి కూర్పు, ఎం. జగన్నాధరావు సహకార దర్శకత్వంతో కొమ్మినేని దర్శకుడు. ఆగస్ట్ 18 – 31, సెప్టెంబర్ 21–30, అక్టోబర్ 21–31 వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది.



'ఇద్దరు దొంగలు'లో కృష్ణ, సత్యనారాయణ, శోభన్‌బాబు

## కృష్ణ,విజయనిర్మల కాంబినేషన్‌లో మరో సంచలన చిత్రం !

''వివాదాస్పదమైన రాజకీయ కథాంశం ఉన్న 'చక్రవ్యూహ' అనే కన్నడ చిత్రం కర్నాటక ప్రాంతంలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. దాన్ని తెలుగులో నిర్మించే రైట్స్ మేం కొన్నాం. వచ్చే సంవత్సరం షూటింగ్ మొదలవుతుంది,'' అన్నారు వినయ్ మూవీస్ అధినేత టి. శ్రీనివాస రెడ్డి. కృష్ణ ప్రధాన పాత్రధారి. విజయనిర్మల దర్శకురాలు. ఎస్. సాంబశివరావు సహ నిర్మాత.




## కొమ్మినేని దర్శకత్వంలో "కొంటె కోడళ్ళు"

''సెప్టెంబర్— అక్టోబర్‌లలో షూటింగ్ ఫినిష్ చేస్తాం,'' అన్నారు మిద్దె చంద్రకుమార్. ఈయన నిర్మించే పి. వి. ఎస్. ఫిలిమ్స్ ''కొంటె కోడళ్ళు'' చిత్రంలో గొల్లపూడి మారుతీరావు, సూర్యకాంతం, తులసి, పూర్ణిమ, నారాయణ రావు, భానుచందర్, సుత్తివేలు నటిస్తారు. పేరాల కథకుడు. ఎస్. వి. ఎస్. ఫిలిమ్స్ సమర్పించే ఈ చిత్రానికి ఎం. విజయకుమార్, ఎం. జీవన్‌కుమార్, ఎం. వెంకటరమణకుమార్ సహ నిర్మాతలు.

శ్యామల గౌరి, పూర్ణిమ, తులసి, 'ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?'





చిరంజీవి 'సంఘర్షణ'

## లలితా మూవీస్ కొత్త చిత్రం

''నవంబర్‌లోగాని, డిసెంబర్‌లోగాని షూటింగ్ ప్రారంభిస్తాం,'' అన్నారు జగదీశ్ చంద్రప్రసాద్. సురేష్, విజయశాంతి, నరేష్ మున్నగువారు నటించే ఈ చిత్రానికి భాస్కరరావు దర్శకుడు.

# కళ్లు...

## వాటిలో భావాలొలికించండి

నవ్వు. సంతోషం. కోపం. విచారం. ఈ భావాలన్నిటినీ మీ కళ్లు మరింత ప్రస్ఫుటంగా వ్యక్తం చేయగలవు...శింగార్ డీలక్స్ కాటుకతో. ఇది మరింత నల్లనిది, మరింత నిగనిగలాడేది. ఎంతో చల్లనిది! ప్రత్యేకంగా రూపొందించబడింది, అంచేత కళ్లకు మంట పుట్టించకుండా అందాలన్నీ చిందిస్తుంది.




**శింగార్**
**డీలక్స్ కాటుక**

కళ్లకు మంచిదైన ఒకే ఒక కంటి సౌందర్య సాధనం.

everest/83/SH/179rt




## అల్ఫా ఒమేగా క్రియేషన్స్ తొలి చిత్రం

''చిలకలూరిపేట, చెంగీస్‌ఖాన్ పేట, గుంటూరు, నాగార్జునసాగర్ ప్రాంతాలలో సెప్టెంబర్ 16 నుండి అక్టోబర్ 10 వరకు షూటింగ్ జరుపుతాం. దాదాపు సగ భాగం చెంగీస్‌ఖాన్ పేటలోని లెప్రసీ హాస్పిటల్ రిహాబిటేషన్ సెంటర్‌లోనే పూర్తవుతుంది,'' అన్నారు కె. వి. ఫణీంద్ర. ఈయన దర్శకత్వం నెఱపే పై సంస్థ తొలి చిత్రానికి ఆగస్ట్ 1 న పాటల రికార్డింగుతో ప్రారంభోత్సవం జరిగింది. శరత్‌బాబు, దీప, సుధాకర్, హేమ సుందర్, జానకి, పుష్పలత, కొందరు ఔత్సాహిక కళాకారులు పాల్గొంటారు. వి. ఎస్. రామేశ్వర రావు సంభాషణలకర్త. ఆత్రేయ, సునార్తవాణి దేవదాస్, కంచర్ల మోహనరావు గీతాలకు కృష్ణ ప్రసాద్ బాణీలు కూర్చారు. కందస్వామి సంకలన కర్త. జె. సి. ఎస్. బాష్పదాస్ నిర్మాత.

## ''కాళయముడు''

''ప్రముఖ తమిళ నటుడు స్వర్గీయ టి.ఎస్. బాలయ్య కుమార్తె శ్రీ పల్లవిని హీరోయిన్‌గా పరిచయం చేస్తున్నాం,'' అన్నారు నందం హరిశ్చంద్రరావు ఈయన దర్శకత్వంలో శ్రీ పల్లవీ ఫిలిమ్స్ ''కాళయముడు'' చిత్రం తొలి షెడ్యూల్ జూలై 29 నుండి ఆగస్ట్ 17 వరకు మద్రాసులో జరిగింది. మోహన్ బాబు, శారద, జయమాలిని, మమత, రాగిణి, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, సాక్షి రంగారావు, రాళ్ళపల్లి, చలపతిరావు, పి. జె. శర్మ పాల్గొంటున్నారు. పరుచూరి సోదరులు మాటలు, వేటూరి గీతాలు, జె. వి. రాఘవులు సంగీతం, ఎస్. వెంకటరత్నం ఛాయ, భాస్కరరాజు శిల్పం, జి. జి. కృష్ణారావు కూర్పు, సీను నృత్యాలతో ఈ చిత్రాన్ని నిర్మించే సూరపనేని బాబు ''చివరి షెడ్యూల్ సెప్టెంబర్ 1 నుండి ఉంటుంది. విజయదశమి నాడు విడుదల చేస్తున్నాం,'' అన్నారు.

## దాసరి రచన, దర్శకత్వంలో ''జగన్''

శోభన్‌బాబు, జగ్గయ్య, గొల్లపూడి మారుతీరావు, అల్లు రామలింగయ్య, వై. జి. మహేంద్రన్, పేకేటి, గోకిన రామారావు, డాక్టర్ రాధాకృష్ణ, నిర్మల, విజయలలిత, జయమాలిని ప్రధానభూమికలు నిర్వహించే లలితాలయ మూవీ మేకర్స్ ''జగన్'' చిత్రం షూటింగ్ మూడువంతులకు పైగా పూర్తయింది. ఈ చిత్రంలో ముఖ్యమంత్రి పాత్ర నిర్వహించే జగ్గయ్య భార్యగా కె. ఆర్. విజయ చెల్లెలు కె.ఆర్. సావిత్రి నటిస్తోంది. చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయతో ఎన్. ఎన్. భట్, వజ్జె సుబ్బారావు నిర్మాతలు.


'కోటికొక్కడు'లో జయమాలిని

'రంగులకల'లో నరసింగరావు, నారాయణరావు



## దాసరి రచన, దర్శకత్వంలో ''రుద్రకాళి''

''ప్రముఖ కన్నడ తార జయమాల హీరోయిన్,'' అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంతో తెలుగు చిత్ర పతాకంలో తయారయ్యే ''రుద్రకాళి'' చిత్రంలో మోహన్ బాబు, మురళీమోహన్ ప్రభృతులు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. సత్యం సంగీతం, కె. ఎస్. మణి ఛాయ, కృష్ణ కూర్పుతో రామినేని సాంబశివరావు నిర్మాత. తొలి షెడ్యూల్ ఆగస్ట్ 15 నుంచి 20 వరకు జరిగింది. ★

# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.

Imageads-M-1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ – తాజాతనము నందించు సబ్బు.

సీరియల్

# మానస చూరశి

కొడాలి సాంబశివరావు

(గత సంచిక తరువాయి)

ప్రతివారి జీవితంలోనూ ఎదురయ్యే మొదటి రాత్రి ఘట్టం — ఆ దంపతులకూ వచ్చింది. దాంపత్య వనంలోకి అడుగు పెట్టబోయే ముందు కన్న కలల్ని — ఆశల్ని పండించుకునే మధుర క్షణాలు సమీపించగానే మానసలో ఏదో భీతి — జంకు ఆవరించసాగాయి.

తనకు తానే తలంటుస్నానం చేసింది. ధవళ వస్త్రాల్ని ధరించింది. జడనిండుగా విరిసిన మల్లెలు తురుముకున్నది. కళ్లనిండుగా కాటుక రేఖ దిద్దుకున్నది. పాలగ్లాసుతో వచ్చి గుమ్మం ముందు ఆగిపోయింది సంశయంగా.

ఆమె అలాంటి ఘట్టాల్ని — మధురంగా కాకపోయినా బ్రతుకుతెరువు కోసం ఎన్నోమార్లు చవిచూసింది. ఆనాడు సిగ్గనిపించలేదు. భయమనిపించలేదు. రాయిలా బిగుసుకుపోయి ఎదుటివారి కోర్కెలు తీర్చింది. అలాంటి మానస నేడు సిగ్గుతోనూ, భయంతోను అడుగు ముందుకు వేయలేకపోతుంది.

గదిలో మంచంమీద పడుకుని ఏదో ఆలోచిస్తున్న విజయ్ ఆలోచనల్ని గాజుల సవ్వడి చెరిపివేసింది. తలత్రిప్పి చూసాడు. గుమ్మంలో అపర రతీదేవిలా మెరిసిపోతున్న భార్యను చూసి మందహాసం చేసాడు.

"అక్కడే ఆగిపోయావేం ? లోపలకు రా—" అన్నాడు మంచంమీద లేచి కూర్చుంటూ. మానస బదులు చెప్పలేదుగానీ కళ్లెత్తి అతనివంక చూసింది. ఆ సోగకళ్లలోని బెరుకును, సౌందర్య దీప్తితో ప్రకాశిస్తున్న మోములోని చిరుసిగ్గుల్ని గ్రహించి చిన్నగా నవ్వుకున్నాడు విజయ్.

"నన్ను పెళ్లి చేసుకోండి —' అని అడిగిన ఆనాటి ధీమా, ధైర్యం ఏమయ్యాయి ? అచ్చమైన ఆడదానిలా సిగ్గుతో అక్కడే ఆగిపోవడం నా కిష్టంలేదు. ఏ ధైర్యంతో నా జీవితంలోకి ప్రవేశించావో, అదే ధైర్యంతో నా చెంతకు రావాలి. నేను మెచ్చేది నీలోని ఆ గుణాల్నే. ఊఁ... కమాన్ ! —"

మానస అదురుతున్న గుండెల్ని అదుపులో పెట్టుకుని ఒక్క అడుగు ముందుకు వేసింది.

"నాకూ మీ చెంతకు రావాలనే వుంది. మీ పదసన్నిధిలో సేదదీరాలని, మీ కర స్పర్శతో పునీతమవ్వాలని వున్నది. కానీ, ఏవో భయాలు పట్టి నన్ను వెనక్కి లాగుతున్నాయి —"

"భయమా ! ఎందుకు?" నివ్వెరపోయాడు విజయ్.

"నేను కన్నెను కాను. అదే నా భయం. అపవిత్రమైన ఈ శరీరంతో దేవునికి నైవేద్యం పెట్టడానికి సాహసించలేకపోతున్నాను. నేను బలహీనురాల్ని. నన్ను క్షమించండి." పాలగ్లాసు టేబుల్‌మీద పెట్టి గిరుక్కున వెనుదిరిగింది మానస.

"మానసా ! —" బిగ్గరగా,బాధగా అన్నాడు విజయ్.

ఆమె ఆగిపోయింది. అతను చటుక్కున లేచి ఆమె చెంతకు వచ్చాడు.

"ఏమిటి ని పిచ్చిమాటలు ? ఆ గతాన్ని నీవు పూర్తిగా మర్చిపోవాలి. ఇది నీకు కొత్త జీవితం. ఈ రోజునుంచే — ఈ ఘట్టంనుంచే మొదలవుతుంది కొత్త జీవితం. మనసులో శంకలు పెట్టుకుని నీవు బాధపడుతూ నన్నూ బాధకు గురిచేయకు — మరోసారి ఇలా మాట్లాడితే సహించేదిలేదు. నీవు నాదానవు. నీ శరీరం నాది. నీ మనసు నాది. ఇక నుంచి నేను చెప్పినట్లు నడచుకోవడం నీవిధి — తెలిసిందా ?"

మానస కళ్లనిండుగా ఆనంద భాష్పాలు నిలిచాయి.

గుండెల్లో పొంగులెత్తే రాగసుధలు ఒక్కసారిగా దూసుకు వచ్చాయి. చటుక్కున అతని పాదాలపైన వ్రాలి కన్నీటితో అభిషేకం చేసిందామె.

"ఏయ్ పిచ్చీ ! నీ స్థానం అక్కడకాదోయ్. ఇక్కడ— " అంటూ ఆమెను లేవనెత్తి కౌగిలిలో బంధించాడు విజయ్.

'అవును. ఇది నా హృదయం... ఇంత తీయని హృదయం తోడుండగా నాకేల భయాలు?' అని ఆబగా, ఆర్తిగా, ఆరాధనగా ఆ కౌగిలిలో పులకరించి పరవశించి పోయింది మానస.

అప్పటి వరకు మబ్బుల మాటున దాగిన చంద్రుడు బయటకు వచ్చాడు. ఆ చల్లని కాంతి ధారలలో కరిగిపోవాలని చూస్తోంది పుడమి భారతి ! అందాల చందమామను ఆట పట్టించాలని చూస్తున్నాయి తారకలు. యుగ యుగాల నుంచి ఆ ఆట ఆడుతున్నా మక్కువ తీరలేదేమో వాటికి. అదే ప్రేమ సయ్యాటలో వున్న గొప్ప మహత్యం.

సిద్ధులకు రససిద్ధులకు కూడా అంతు పట్టని గొప్ప సత్యమిది !

## 22

కాల చక్రం ఒక నెల రోజులు వేగంగా ముందుకు నడిచింది. విజయ్ మానసల దాంపత్య జీవనం ఆనంద దాయకంగా— మృదు మధురంగా సాగిపోతోంది. విజయ్ బయట డ్యూటీలో వున్నప్పుడు ఎంత కఠినంగా వ్యవహరిస్తాడో, ఇంట్లో భార్య సమక్షంలో అంత చిలిపిగా, కవ్వింపుగా ఆమెను ఆట పట్టిస్తుంటాడు. మానసదృష్టిలో అతను చిన్న పాపాయి. తన చింతలన్నీ మర్చిపోయి

**జరిగిన కథ — 9 :** హోటల్ మంజులో జరిగిన పోలీసు రైడింగ్‌లో మానస, సుకుమార్‌లను అరెస్ట్‌చేస్తాడు ఇన్‌స్పెక్టర్ విజయ్. సుకుమార్‌ను మంత్రిగారి ఆజ్ఞానుసారం విడుదల చేయకతప్పలేదు విజయ్‌కి. మానసనుకూడ విడుదల చేస్తాడు. రాత్రి ఇంటికి వస్తున్న మానసను రౌడీల బారినుండి రక్షించి ఆమె ఇంటికి చేరుస్తాడు విజయ్. ఇన్‌స్పెక్టర్ విజయ్‌పేరు వింటేనే పేవ్‌మెంట్లమీద చిల్లర వ్యాపారాలు చేసేవారు, అవినీతిపరులు గడగడలాడుతుంటారు. ఏ కొద్దిమంది స్వార్థపరులకో తప్ప విజయ్ కార్యదీక్షత, నిజాయితీ చాలమందిని ఆకర్షించాయి. మానస మూడవసారి విజయ్‌కు పట్టుబడుతుంది. అతను ఆమెను శ్రీనివాస్ ఏజన్సీస్‌లో చిన్న ఉద్యోగంలో చేరుస్తాడు. మానసకు అక్కడా చుక్కెదురవుతుంది. మానస వేరే ఉద్యోగం చేయడానికి ఒప్పుకోదు. ఈ నీచ వృత్తే నీకు ఇష్టం అని మానసను విజయ్ నిందించగా ఇన్ని మాటలకు బదులు తనను పెళ్లి చేసుకొని ఉద్ధరించమని అడిగి వెళ్లిపోతుంది. విజయ్ తను మానసను పెళ్లి చేసుకోడానికి నిర్ణయించుకున్నట్లు ఆమెకు చెపుతాడు. ఆమె అతనిని తన ఇంటికి తీసుకెళ్లి తన కుటుంబ సభ్యులను పరిచయం చేస్తుంది. మానస కోరిక ప్రకారం కోవెల్లో ఆమెను వివాహం చేసుకుంటాడు విజయ్.

గృహిణిగా తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తూ భర్త కనుసన్నులలో మెలగసాగింది మానస.

వారి సంసారరథం పూల బాటవెంట ఉరుకుల పరుగులతో పయనిస్తోంది.

వారి అన్యోన్యతను,– ఆనందాన్ని చూడలేక దేవుడు ఓ చిన్న సంఘటనను సృష్టించి వారి మనసుల్లో కలతల్ని రేపాడు.

ఆరోజు... మానస షాపింగు ముగించుకుని రిక్షాలో ఇంటికి రాబోయింది. ఇంతలో 'మానసా' అన్న పరిచితమైనకంఠం వినిపించింది. ఆకంఠం తాలుకు వ్యక్తిని గుర్తుపట్టి ఆమె ముఖం వివర్ణమయింది.

నవ్వుతూ రిక్షా దగ్గరకు వచ్చాడు సుకుమార్!

మానస రిక్షాను పోనివ్వమన్నది కంగారుగా. కానీ సుకుమార్ రిక్షాను కదలనివ్వలేదు. రిక్షా తాత వారివంక అయోమయంగా చూసాడు.

''ముందు రిక్షాదిగు, నీతో మాట్లాడాలి'' నవ్వుతూ అన్నాడు సుకుమార్.

''నాకు పనుంది అడ్డు తప్పుకో...''

''నీతో నాకూ పనుంది.–'' అదోలా నవ్వాడతను.

''నాతో నీకేమిటి పని ?'' కోపంగా చూసింది మానస.

''అప్పుడే మరిచిపోయావా ? ఆ రోజు హోటల్ గదిలో వందరూపాయలు అడ్వాన్సు తీసుకుని ఉడాయించావు. మరెపుడయినా కనిపించు ఆ వందకు సరిపోయే సుఖాన్ని అందిస్తానని ప్రామిస్ చేసావు. గుర్తులేదా ?''

మానస ఖంగుతిన్నది. అతని వరస చూస్తుంటే పెద్ద రభస చేసేట్లున్నాడని గ్రహించింది. అతనితో ఘర్షణపడి నలుగురి దృష్టిని ఆకర్షించడం ఇష్టంలేక అతనితో రాజీపడి తెలివిగా తప్పించుకోవాలను కున్నది.

రిక్షాదిగి రోడ్డువారగా జనం లేనిచోట నిలుచున్నది. సుకుమార్ ఆమెను అనుసరించాడు. మానస పర్సు తెరిచి వందరూపాయల నోటును అందించింది.

''ఏమిటిది ?''

''నీ కివ్వాల్సినబాకీ–''

''నా బాకీ డబ్బుతో తీరేదికాదు–''

''సారీ! నేనా వృత్తిని మానేశాను. నా కిప్పుడు పెళ్ళయింది. దయచేసి మీ డబ్బు తీసుకుని మీ దారిన మీరు వెళ్ళండి.–'' వేడికోలుగా అన్నది మానస.

వ్యంగ్యంగా నవ్వాడు సుకుమార్.

''తాళికట్టించుకున్న ప్రతి ఆడది పతివ్రత అయితే ఇక తాళికి– సంసారస్త్రీకి విలువుండదు. ఏం నేను ఆ విజయ్ గాడిపాటి చేయనా ? ఆఫ్టాల్ వాడెంత ?

నేను తలుచుకుంటే వాడి ఉద్యోగం పీకించి అండమాను దీవులకు పంపగలను. కానీ, నేనా పని ఇప్పుడు చేయదలుచుకోలేదు. దానికి సమయం వస్తుంది. ప్రస్తుతం నా పని నీతోనే. పద వెళ్దాం–'' అని ఆమె చేయి పట్టుకున్నాడు సుకుమార్.

రోషంతో – కోపంతో అతన్ని విదిల్చి కొట్టింది మానస.

''మిస్టర్ సుకుమార్! నీవు పశువ్వి. ఇష్టంలేని ఆడదాన్ని బలవంతం చేయడం మగతన మనిపించుకోదు. ఈ సంగతి ఆయనకు తెలిస్తే నీ ఎముకలు ఏరేస్తారు. మర్యాదగా నన్ను వెళ్ళనీ–''

సుకుమార్ పకపక నవ్వాడు.

ఇంతలో వారి ముందు ఒక కారు వచ్చి ఆగింది. డ్రైవర్ సీట్లోవున్న యువకుడు తల బయటకుపెట్టి ''హల్లో సుకుమార్! ఏమిటి ఇక్కడ నిలబడ్డావు? ఏమిటి కథ?–'' అని కళ్ళెగరేసాడు మానసను క్రీగంట చూస్తూ.

''తరువాత చెబుతాను. ముందు డోర్ తెరువు.–'' అంటూ చటుక్కున మానస రెక్క పట్టుకుని బలంగా కార్లోకి త్రోసి డోర్ వేసాడు సుకుమార్.

మరుక్షణమే కారు రివ్వున దూసుకుపోయింది. ఆ శబ్దంలో మానస అరుపు కలిసి పోయింది. అంతవరకు గుడ్లప్పగించి చూస్తున్న రిక్షా తాత దిగ్భ్రాంతి చెందాడు. అతనితోపాటు కొందరు దారిన పోయేవాళ్లు ఆ దృశ్యాన్ని చూసి



నోరెళ్లబెట్టారు. కొన్ని క్షణాల తరువాత రిక్షా తాత తేరుకుని అతనికేదో అనుమానం వచ్చి పోలీసు స్టేషన్ వైపు రిక్షాను మళ్లించాడు కాలి సత్తువకొద్దీ.

* * *

ఊరి చివర నిమ్మతోటలో వున్న గెస్ట్ హౌస్‌లో సందడి చెలరేగింది.

బీరు బుస్సున పొంగింది. విస్కీ బాటిల్స్ పగిలాయి. ఐసుముక్కలు కరిగాయి. గాజు గ్లాసులు గల గల నవ్వాయి. సుకుమార్ బృందం తలా ఓ గ్లాసు అందుకుని 'ఛీర్స్' కొట్టారు. అక్కడ సుకుమార్‌కాక మరో ముగ్గురు యువకు లున్నారు. వాళ్లంతా సిరిగల బాబులే! మగసిరి కూడా కలవాళ్లమేనని చెప్పుకోడానికి ఒక్కొక్కరి ప్రక్కన అద్దెకు తెచ్చుకున్న ఒక్కొక్క సుందరాంగి!

ఆ సుందరీమణులుసొగసుల్ని విరజిమ్ముతూ, సోయగాల్ని ప్రదర్శిస్తూ వారిని సుఖపెట్టి మెప్పు పొందాలని తెగ హైరానా పడిపోతున్నారు.

మరోసారి గ్లాసులు నిండాయి. ఈసారి గాజుల చేతులు అందుకున్నాయి గ్లాసుల్ని. తమ పెదవుల దగ్గరకు వస్తాయని ఆశించిన ఆ పురుష పుంగవులకు నిరాశే కలిగింది.

కాలం ముందుకు జరుగుతూ వారి ఆనం దానికి హద్దులు చెరిపేస్తోంది.

కైపెక్కిన కళ్లతో, తిమ్మిరెక్కిన నాలు కలతో పిచ్చి పిచ్చిగా వాగుతూ తన చుట్టూ ఓ స్వర్గాన్ని నిర్మించుకునే తాపత్రయంలో వున్నా రంతా.

''సుకుమార్ టేప్ ఆన్ చేయ్. రజియా డాన్స్ చేస్తుంది–''

టేప్ ఆన్ అయింది. అందులోంచి వస్తున్న పాశ్చాత్య సంగీతతరంగాలు వీనులవిందు గొలుపుతూ వారి నిషాను మరింత పెంచుతోంది.

తడబడే అడుగులతో ఒకర్ని ఒకరు చుట్టుకుపోయి మూడు జంటలుగా చీలి పోయారు. సంగీతానికి అనుగుణంగా తుళ్లుతూ తూలుతూ అడుగు లేస్తున్నారు.

సుకుమార్ మాత్రం ఒంటరిగా మిగిలి పోయాడు జంటలేక.

''కమాన్ సుకుమార్! నీ చిలకను తెచ్చుకో–'' అని కవ్వింపుగా నవ్వాడు మదన్.

''ఆ చిలుక కులికేదికాదు. పలుకులే పన్నీటి జల్లులై మునకవేయిస్తుంది – '' ఓ రసికా గ్రేసురుడు కామెంట్ చేయగా అంతా గల గల మని నవ్వారు.

సుకుమార్ లేచి నిలబడ్డాడు. ప్రక్క గదిలో బంధింపబడిన మానసను చేయిపట్టుకుని లాక్కువచ్చాడు. మానస గింజుకుంది.

''ఏమిటీ దౌర్జన్యం? నన్నెందుకిలా పట్టి తెచ్చావు?–'' బొంగురు స్వరంతో బెంబేలుపడి పోతూ అడిగింది మానస.

## మానస మురళి

''పాపం ఏమీతెలియని నంగనాచి–'' చిలిపిగా నవ్వుతూ చటుక్కున మానసను కౌగలించుకో బోయాడు సుకుమార్.

''ఇడియట్–'' అని ఈడ్చి అతని చెంప మీద కొట్టింది మానస.

గదిలో ఒక్క క్షణం నిశ్శబ్దం ఆవరించింది. అందరి చూపులు ఆమె మీదనే నిలిచాయి. అనా లోచితంగా మదన్ చేతివేళ్లు టేప్‌ని నొక్కాయి.

''మీరు మగాళ్లేనా? మీలో నిజంగా మగతనం వుంటే — నా ఒంటిమీద చేయి వేయ కుండా నా మనసును లోబరుచుకోండిరా. ఈ గాడిద కన్నుకానని కామంతో ఓ ఇల్లాల్ని పట్టి తెచ్చాడు. నాకిష్టమైతే ఆనందంగా వచ్చి మీ ఆనందంలో పాలు పంచుకునేదాన్ని. బ్రతుకు తెరువుకోసం ఒకప్పుడు ఆ పనులన్నీ చేసాను.

నేనిప్పుడు మారిపోయాను. పాత జీవితానికి స్వస్తి చెప్పాను.

ఓ దేవుని పూజలందుకునే దేవతగా మారాను. నేనెంత చెడిపోయిన దాన్నే అయినా మీ అంత నీచానికింకా దిగజారలేదు. జీలకర్రలో కర్రలేనట్లు మీలో మానవత్వమే నశించిపోయింది. ఈ తప్పు మీదికాదురా. మిమ్మల్నికన్న తల్లులది. ఆ తల్లులు ఈ క్షణంలో ఎదురైతే పట్టి చెరచ గల కిరాతకులు మీరు. కామం నిండిన మీ కళ్లకు ఆడవాళ్లంతా ఒక్కటిగానే కనిపిస్తారు. మృగాల స్థాయికి మీరేం తీసిపోరు. విచక్షణ నశించిన మీకు ఎంత చెప్పినా అర్థంకాద మీ గుండెలుకావు బండలు–'' ఆవేశం మానస గుండెలెగిసి పడుతున్నాయి. కళ్లు అ కణాల్ని కురిపిస్తున్నాయి. భద్రకాళిలా వున్నది

ఆ మాటలకు వారి మత్తు సగం దిగింది ఆవేశం – రోషం ఉప్పెనలా దూసుకువచ్చాయి

''ఏమిటే కూశావ్? – '' దూకుడుగా ముందుకు వచ్చాడు మదన్.

''ఆగు! ముందుకువస్తే ప్రాణం తీస్తాను –'' ఆడపులిలా గర్జించింది మానస

''ఏమిటే నీవు చేసేది? ఫ్రెండ్స్, దీని పెడరెక్కలు విరిచి పట్టుకోండి – దీని రోగం కుదురుస్తాను –'' కోపంగా ఆజ్ఞను జారీ చేసాడు సుకుమార్.

అంతే. ముగ్గురూ మూడు వైపులా కమ్ముకుని ఆమె పెడ రెక్కలు విరిచి పట్టు కున్నారు. మానస రోషంతో, బాధతో కుతకుత వుడికిపోయింది.

సుకుమార్ క్రూరంగా నవ్వుతూ ఆమె జుట్టు పట్టుకుని ఆవేశంగా చెంపల్ని వాయిం చేశాడు. అవమానంతో – బాధతో నిలువునా కంపించిపోయింది మానస.

ఆమె పమిట చెరుగులాగేసి, జాకెట్టును పర్రున చింపేశాడు సుకుమార్.

హేళనగా, వికృతంగా నవ్వారు మిగతా ముగ్గురు.

ఆడవాళ్లు చప్పట్లు చరుస్తూ కేరింతలు కొట్టారు.

మానస స్థితి ఆనాడు కురుసభలో కుమతులచేత పరాభవింపబడిన ద్రౌపదిలావుంది. సిగ్గుతో పరితాపంతో ఆమె హృదయం దహిం చుకుపోతుంది. 'ప్రభూ! చూస్తున్నావా? ఈ అమానుష చర్యను తిలకిస్తున్నావా? నిస్సహాయురాలునైన నన్ను ఈ దుర్మార్గులు పరాభవిస్తుంటే చూసి ఆనందించుతున్నావా? వద్దు... ఈ దుర్మార్గుల్ని ఇంతటితో ఆపేయ్. నేనీ క్షోభ భరించలేను–' అని మానస కనిపిం చని దేవుడ్ని స్మరించింది.

సరిగ్గా అక్కడో దేవుడు ప్రత్యక్ష మయ్యాడు. ఆ దేవుడు పూలరథంమీద రాలేదు. మోటర్ బైక్‌మీద వచ్చాడు. ఆ బైక్ శబ్దం శతృవుల గుండెల్లో వణుకుపుట్టించింది. చటుక్కున ఆమెను వదిలేసి దిగ్భ్రాంతులై గుమ్మాలవైపు చూసారు.

మానస పంజరం నుంచి బయటపడిన పక్షిలా రివ్వున వెళ్లి తన దేవునికి చుట్టుకు పోయింది. ఆ దేవుని రూపంలోవున్న ఇన్‌స్పెక్టర్ విజయ్ దవడ ఎముకలు బిగుసుకున్నాయి. ముఖంనిండా కాఠిన్యత అలుముకుంది.

''మానసా! ముందు నీవు ఇక్కడినుంచి వెళ్లు –'' ఆజ్ఞాపించాడు.

మానస పెదవి కదపబోయింది.

విజయ్ తీవ్రంగా చూసాడు ఆమెవంక.

### ఆసుపత్రులా, కర్మాగారాలా?

వర్తమాన కాలం తెస్తున్న మార్పులు ఆసుపత్రులను ఆరోగ్య కర్మాగారాలుగా మారుస్తున్నాయనే అభిప్రాయాన్ని ఒక జర్మను పత్రిక వ్యక్తం చేసింది. ఆపరేషను థియేటర్లు కూడా కేవలం వర్క్‌షాపులుగా మారుతున్నాయి. ఈ ఆధునిక ధోరణు లను అరికట్టలేము. కానీ మానవుని సంగతి ఏమిటి? ఈ ఆరోగ్య కర్మాగారా లలో చికిత్స శరీరానికేకాని, మనోభావాలకు కాదు. దీనికి కారణం కొంతవరకూ ప్రజలే. పెద్ద ఆసుపత్రులలో చికిత్స మెరుగ్గా ఉండగలదని ప్రజలు భావిస్తు న్నారు. కానీ, రోగికి అతడి ఆలోచనా ధోరణిని అనుసరించి చికిత్స చేయాల్సి ఉంటుంది. ఖరీదైన వైద్య పరికరాల కంటే, ఓపికతో రోగి మనసును అర్థం చేసుకుని చికిత్స చేసే డాక్టరే ఉత్తమమని ప్రజలు గ్రహించాలి. ఆసుపత్రులు కేవలం కర్మాగారాలుగా మారటాన్ని ప్రజలే అరికట్టాలని ఈ పత్రిక తెలియచేసింది!







చెప్పాలనుకున్న మాటలు గొంతు దాటి పైకిరాలేదు. చప్పున తలదించేసుకుంది. ఉబికి వస్తున్న దుఃఖానికి ఆనకట్టవేయడం సాధ్యం కాక తలదించుకుని చరచరా అక్కడనుంచి వెళ్లి పోయింది మానస.

ఉగ్రంగాచూస్తూ ప్యాంటుకున్న బెల్టు విప్పుకున్నాడు విజయ్.

యుద్ధానికి సిద్ధమైన సైనికుల్లా వాళ్ళు కూడా రెడీ అయినట్లు రొమ్ములు విరుచుకుని ముందుకు దూకేరు.

ఈ హడావిడిలో సుందరాంగులు ఎప్పుడో బయటకు జారుకున్నారు.

## 23

ఇరవై రోజుల తరువాత విజయ్‌ను హాస్పటల్‌నుండి డిచార్జ్ చేసారు. గాయాలన్నీ చాలావరకు మానిపోయాయి. బాగా నీరసపడి పోయాడు. దృఢంగా ఉక్కులా వుండే మనిషి పీక్కుపోయినట్లుగా సగమయ్యాడు.

అన్ని రోజుల నుంచి ఉగ్గ బట్టుకున్న ఆవేశాన్ని – దుఃఖాన్ని ఇక ఆపుకోలేకపోయింది మానస.

"నేను నష్టజాతకురాల్ని, నావలన మీరు ఇంకా ఎన్ని అవమానాల్ని ఎదుర్కోవాలో... ఎన్ని పరాభావాల్ని చవిచూడాలో... సాఫీగా సాగుతున్న మీ జీవితంలో కలతల్ని సృష్టించిన పాపాత్మురాల్ని. క్షమించమని అడిగే అర్హత కూడా లేదు నాకు –" అని వలవల ఏడ్చింది మానస.

విజయ్ ఆత్మీయంగా, ప్రేమగా ఆమె శిరస్సు నిమిరాడు.

"నా వృత్తిధర్మ నిర్వహణలో ఇలాంటి చిన్న చిన్న సంఘటనలు మామూలే! ఆ వెధవలు నా చేతికి దొరక్కుండా పోరు. ఈ రోజు చాటుగా దెబ్బతీసి తప్పించుకున్నా ఏదో ఒకనాడు నా చేతిలో శిక్షింపబడతారు –"

"కావచ్చు. ఆవిధంగా మీ పగ చల్లారుతుంది. కానీ, నావలన జరిగిన ఈ అనర్థానికి ఎలా ప్రాయశ్చిత్తం చేసుకోను? ఈ రోజు వాళ్ళు నన్ను పరాభవించారని కలబడి దెబ్బలు తిన్నారు. రేపు మరికొందరు. ఆపైన ఇలాంటివి ఎన్నో...నన్ను చూసి హేళన చేస్తూనేవుంటారు. అందుకు నా గత చరిత్రే కారణం! నా చరిత్ర మీ కాళ్లకు సంకెళ్ళ వేసి మీ భవిష్యత్తును నాశనం చేస్తుంది. అలా జరగడం నేను ఎంత మాత్రం సహించలేను –"

"మానసా! ఏమిటి నీ పిచ్చివాగుడు? ఇప్పుడు నామకేయిందని? నేను బాగానే వున్నాను గదా! అయినా నీవలనే నాకు దెబ్బలు తగిలాయని ఎందుకు బాధపడతావు? ఆ స్థానంలో నీవుగాక మరే ఆడపిల్ల వున్నా ఇలాగే తలపడేవాడిని, అది నా కర్తవ్యం! దుండగుల్ని శిక్షించి ప్రజలకు రక్షణ కల్పించడం నా విధి. అనవసరమైన ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు –" అనునయంగా ఓదార్చాడు విజయ్.

అయినా ఆమె వేదన చల్లారలేదు.

"మీరెన్ని చెప్పినా నా మనసు కుదుటపడడం లేదు. పాపపంకిలమైన నా గత జీవితం నన్ను నీడలా వెంటాడి వేధిస్తోంది. ఆశ్రయమిచ్చిన మిమ్ముల్నికూడా కబళించడానికి సిద్ధమవుతోంది.

నేను గడ్డిపూవును.

పూజకు పనికిరాని పువ్వును తెచ్చి హృదయ కోవెల్లో వుంచబోయారు. నాకంతటి అర్హత, విలువలేదని ఈ సమాజం అడుగడుగునా గుర్తు చేస్తుంది. నాకు ఉన్నతమైన విలువల్ని కల్పించాలని మీరెంత ప్రయత్నించినా ఈ లోకం సహించలేకపోతుంది. బురదనిండిన నా జీవితాన్ని మీరెంత పరిశుద్ధం చేసినా – మనచుట్టూవున్న లోకం మరింత బురద విసురుతుంది. మట్టి కొట్టుకుపోయిన ఈ పువ్వును మీరేం చేసుకుంటారు? వదిలేయండి. వదలకపోతే మీకు కూడా మన్ను అంటుతుంది–"

"మంచి సలహానే ఇచ్చావు. ఇప్పుడు నీవు చెప్పినవన్నీ నాకు తెలియవనుకున్నావా? బురదలో పూచిన ఈ పద్మాన్ని అందుకుని పదిలపరచడమే నా ధ్యేయం. ఆ ప్రయత్నంలో బురద అంటుకున్నా, బ్రతుకు మాడినా నా దీక్ష ఆగదు. అవన్నీ ముందుగా ఆలోచించే ఈ పద్మం పైన చేయివేసాను–" కటువుగా, దృఢంగా పలికిందతని స్వరం.

"కొందరి కరకుశత్వం గుండెల్ని కోసేస్తే మీ మంచితనం నా మనసును పిండేస్తుంది. నా మీద మీకెందుకింత దయ?–" ఆర్ద్రనయనాలతో జాలిగొలిపేలా ప్రశ్నించింది మానస.

"దయకాదు. అనురాగం –"

"ఈ పిచ్చి ప్రేమతో మిమ్మల్ని మీరు వంచించు కుంటున్నారు. నన్ను వెళ్ల నివ్వండి. నేను మీ జీవితం నుండి నిష్క్రమిస్తే ఏ ఒడిదుడుకులూ లేకుండా సాగిపోతుంది."

"ఏమన్నావు? వెళ్లిపోతావా? ఎక్కడికి?" ఆవేశాన్ని అణుచుకోలేక ఆమె చెంప ఛెళ్ళు మనిపించాడు విజయ్.

రెండు కన్నీటి చుక్కల్ని నేలకు రాల్చింది మానస.

అతను రెండు క్షణాలు తమాయించుకుని "నన్ను వదలి నిజంగా వెళ్లిపోగలవా? ఏదీ ఇలా నా కళ్లలోకి చూసి చెప్పు. ఎందుకు నన్నిలా బాధ పెడుతున్నావు? నీకేం తక్కువచేసానని ఇలా విపరీతమైన మాటలతో తూట్లు పొడుస్తున్నావు?–" అంటూ ఆమె గడ్డంపైకెత్తి కళ్లలో కళ్లుంచి చూసాడు విజయ్.

అతను కురిపించే అనురాగ వర్షానికి ఆమె కరిగిపోయింది.

'ప్రేమంటే ఇదేనా?' అని ఒక్క క్షణం పులకించి పోయింది.

ఆమె కోరుకునేది అలాంటి ప్రేమనే!

"నీవు వెళ్లిపోతే నేనేమైపోవాలి? ఈకొద్ది రోజుల్లోనే నా మనసుకు త్రెంచుకోలేని తీయని రాగబంధాన్ని బిగించావు. చెలిమితో అల్లుకుపోయి వెచ్చెలిలా మురిపించి మైమరపించావు. రాగాలు ఇంకిన ఈ ఎదలోయల్లో అనురాగాలు పలికించి రసానుభూతుల్ని అందించావు. ఇప్పుడు నీవు వెళ్లిపోతే నాకు మిగిలేది శూన్యమే!

ఆల్‌రైట్! నా స్వార్థం కోసం నిన్ను




ఆపలేను. నిజంగా నీకు వెళ్లిపోవాలనిపిస్తే వెళ్లిపో...... కానీ, ఒక్కటిమాత్రం మరవద్దు. నా నుంచి విడిపోయినా నీవు శాంతంగా, సుఖంగా బ్రతకలేవు.

ఎందుకో తెలుసా ?

## మానస మురళి

నీవు నన్ను అమితంగా ప్రేమించావు గనుక !''

మానస హృదయం ఊగిపోయిందా మాటలతో. గుండెలోంచి తన్నుకొచ్చిన రాగకెరటం, కళ్లలోంచి పుట్టుకొచ్చిన ప్రేమ కిరణం ఆమెను కదిల్చివేసాయి. ఇక నిగ్రహించుకోలేక ''నన్ను క్షమించండీ–'' అంటూ అతని ఎదమీద వాలి పోయింది.

* * *

మరో పదిరోజులు గడిచాయి.

విజయ్ సంపూర్ణ ఆరోగ్య వంతుడైనాడు. మామూలుగా డ్యూటీ కెళుతున్నాడు. తనను చాటుగా దెబ్బతీసి తప్పించుకున్న సుకుమార్ బృందాన్ని ఎలాగయినా పట్టి శిక్షించాలని వాళ్ల కోసం గాలిస్తూనే వున్నాడు.

ఒకరోజు అనుకోకుండా మదన్, మరో ఇద్దరూ దొరికిపోయారు. నిర్దాక్షిణ్యంగా వాళ్లను అరుస్టుచేసి జైల్లో వేయించాడు విజయ్. కానీ సుకుమార్ మాత్రం దొరకలేదు. 'వాడు కూడా ఏదో ఒక రోజున నా చేతికి దొరకక పోడు–' అని అవకాశం కోసం ఎదురుచూడ సాగాడు.

మానసకు కాలం సంతోషంగానే కరిగి పోతుంది. ఇప్పుడామె ప్రపంచం ఇల్లు, భర్త- అంతవరకే పరిమితమైపోయింది. కావాలని ఆ పరిధిలోనే వుండిపోయింది. గడపదాటి వెళ్లడం లేదు. కూరలు కావాలన్నా, సరుకులు కావాలన్నా పనిమనిషిని పంపుతున్నది. బయటకు వెళ్లితే తాను ఎన్నో అవమానాల్ని ఎదుర్కోవాలి. తన వరకు ఫర్వాలేదు. తనకో జీవితాన్ని కల్పించిన దేవునికి అశాంతిని కల్పించడం ఇష్టంలేక ఎప్పుడూ ఇంట్లోనే వుండి పోతుంది.

అక్కడికీ ఒక రోజు విజయ్ – ''ఇలా ఇంట్లో కూర్చుంటే ఏం తోస్తుంది? లీలా మహల్‌లో ఇంగ్లీషు పిక్చరు బావుందట వెళ్దామా ?–'' అని అడిగాడు.

మానస నవ్వి ''మీరు వెళ్లిరండి. నేను ఎక్కడికీ రాను–'' మృదువుగా తిరస్కరించింది.

''అదేం ?–''

''అదంతే'' అని నవ్వేసి అక్కడ నుంచి వెళ్లిపోయింది మానస.

ఆమె అంతర్యం అతనికి అర్థమయింది. ఏదో తెలియని బాధ గుండెను ఆవరించినట్లు అయిందా క్షణం.

ఆ రాత్రి మళ్లీ అన్నాడు భార్యతో.

కానీ, మానస నవ్వుతునే తిరస్కరించింది.

''పోనీయండి ... ఇప్పుడు నాకేం తక్కువైంది. నాకు ఇంటోనే బావుంది–'' అంటూ ఆరాధనగా అతన్ని పెనవేసుకుపోయింది.

విజయ్ భారంగా నిట్టూర్చి 'కొన్నిరోజులు పోవాలి. ఎంతటి గాయాన్నయినా కాలం మాన్పుతుంది' అని అప్పటికి సరిపెట్టుకున్నాడు

(ఇంకావుంది)

## రమ్య - నగరి

పెళ్లి చూపులపై మీ అభిప్రాయం ఏమిటి?

★ నాకు నమ్మకం లేదు.

కర్మసిద్ధాంతాన్ని నమ్మడం మూర్ఖత్వమా?

★ కాదు. కాని కర్మ అని ప్రయత్నలోపం చేయడం మూర్ఖత్వం.

ఇంగ్లీషులో నాల్గుముక్కలు రాయడం చేతగాని మన డిగ్రీదారులకు మీ సలహా?

కాలేజీలలో స్కూళ్లలో నేర్పక పోయినా — స్వంతంగానైనా నేర్చుకొమ్మని. [ఇలా అంటే — మళ్లీ ఆంధ్రాలో ట్యూషన్ అంటారు. కాదు. తీరికగా కూర్చుని ఏ 'రెన్ అండ్ మార్టిన్' నో ఓ పట్టుపట్టటమే మంచి ఇంగ్లీషు రాడానికి దారి; స్పెల్లింగు, ఉచ్చారణా దోషాలు ఎప్పటి కప్పుడు డిక్షనరి పెట్టుకుని కరెక్టు చేసుకోవడం అలవాటు చేసుకోవాలి. ఒక్కమాట కోసం డిక్షనరీ తీస్తే — ఆ పేజీ అంతా చదవడం అలవాటు చేసుకోవాలని మాకు మా మదర్ విలియన్ చెప్పేవారు.]

## వి. ఎస్. ఆర్. — వాగార్థవసాగరు

భర్త వుండగానే తెల్లచీర కట్టుకుని, బొట్టు, గాజులు తీసేసిన స్త్రీని ఏమనాలి?

★ భర్త పోడానికీ — వీటికీ సంబంధం లేదని చెప్పక చెప్తూంది — మీలాంటివారికి.

## కె. వి. ఆర్. — దుంపగడప

ప్రేమించి పెళ్లాడమంటారా? పెళ్లాడి ప్రేమించమంటారా? క్లుప్తంగా జవాబిస్తారని ఆశిస్తున్నాను.

★ మీ యిష్టం!



# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

## జి. ఆర్. ఆర్. — పాలగూడెం

ప్రేమకు పరాకాష్ఠ ఏది?

★ పెళ్లి కాదా?! త్యాగమేనా?!

'పగిలిన హృదయాన్ని దేవుడికిస్తే అతికించి యిస్తాడు. అదే స్త్రీకి యిస్తే పగలకొట్టేదాకా నిద్రపోదు' అన్నాడొక కవి. మీ కామెంట్?

★ మరీ "మాట్లు" వేసేవాడిలా తయారయ్యాడన్నమాట దేవుడు! "ఓటికుండ మాటు పడదు. దండగ. తెగించి పారేయడమే దారి" అని గ్రహించినది ఆడది... తప్పేముంది?

## మధు - కొటాల

పరస్పర అవగాహన వున్న పెళ్లిళ్లు ఇప్పటి సమాజ పరిస్థితులలో రాణిస్తాయి కదండీ?

★ పరస్పర అవగాహన వుంటేనే — ఏ సమాజంలోనైనా పెళ్లి నిలబడేది.

## వీర్ పామర్లకోట

మీ పేరులో రెండక్షరాలవల్ల మీకు ముఖ్యమంత్రి అయ్యే యోగం వుంది.

★ పొరపాటు. మద్రాసులో శ్రీనివాసన్‌లాగా ఆంధ్రలో రాములు కోకొల్లలు. అందరికీ పదవీ యోగం ఉండదు. 'ఫోజెన్' వ్యక్తి ఎన్.టి.ఆర్!

## ఎల్. కె. ఆర్. — శ్రీకాకుళం

నా స్నేహితురాలొకామె నాలాంటి వారందరితో పరిచయం ఏర్పరచుకొని 'నిన్ను ప్రేమిస్తున్నాను పెళ్లి చేసుకుంటావా' అని అడుగుతుంది. నేను ఓ.కె. అన్నాను. కాని ఆమెకు ఒక యువకునితో శారీరక సంబంధం వుందని తెలిసింది. నిజమా అని అడిగితే నవ్వేసింది. ఆ తరువాత చెప్పింది 'నేను ఎందరినో ప్రేమించాను. వారిలో నువ్వు ఒకడివి అని, అంటే ఈమె మానసిక వ్యభిచారియే కదా?'

★ మానసిక వ్యాధిగ్రస్తగా తోస్తూంది— మీరు చెప్తున్నది నిజమైతే?!

## పి. యి. ఎమ్. — కాశీబుగ్గ

ప్రేమ, పెళ్లి అంటూ ధనాన్ని ఆశించే స్త్రీని ఏమనాలి?

★ ప్రేమ, పెళ్లి అంటూ ధనాన్నికోరే మగవారిని ఏమంటున్నారు మీరు?

## ఎస్. కె. ఆర్. - రాయిగడ

పాఠకులు ఎక్కువగా ప్రేమగురించి ప్రశ్నలు వేస్తూ వుంటారెందుకు?

★ మనిషికి తిండి తరువాత ప్రేమ ముఖ్యంగా తోస్తుంది కదా? అందుకు.

## బి. ఆర్ ఎస్. ఆర్. పి. - కాజీపేట

రామలక్ష్మిగారూ. జీవితంలో కోరుకున్నది మనిషికి లభిస్తే?

★ హార్టుగి ఛస్తాడు! అందుకే కోరికలు తీరీ తీరనట్టుగానే వుంటూ వుంటాయి.

జీవితంలో మనిషి సాధించలేనిది ఏది?

★ తనకున్నవి — ఎదుటివాడికి లేకుండా చేయికల్గడం. ఎంత ప్రయత్నించీ ఓడిపోతూనే వుంటాడు.

## పి. ఎస్. ఆర్. — శింగవరం

మిమ్మల్ని తికమకపెట్టే ప్రశ్నలకి వంకర టింకర సమాధానాలు యివ్వడం. ఆడాళ్లని అందలం ఎక్కించే ప్రశ్నలకి పరిభాష్య సమాధానాలివ్వడం ఏమంత సబబని??

★ మీ బాధ సబబేనా?

## ఎస్. ఎస్. వి. - తుని

విద్యా, వ్యాపారమా, వ్యవసాయమా — ఏది గొప్ప?

★ తిండికి, బట్టకీ లోటు రానీయకుండ, ఒకరిని దేహి అని అడగనవసరం లేకుండా— బ్రతుకు వెళ్లమార్చడానికి— తగినది ఏదైనా మంచిదే. ★

ఇటీవల సిద్ధేంద్ర ఆర్ట్స్ అకాడెమీ (హైదరాబాదు) వారి ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా చి. ఎల్లా సోమశేఖరంకి సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి దేవసేన మాతృశ్రీ సంస్థల అధ్యక్షులు శ్రీ ఎం.వి. సుబ్బారావుద్వారా మొమెంటో అందజేస్తున్న దృశ్యం.



# నియమ పరీక్ష

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి

బ్రాహ్మణులధికంగా ఉండే గ్రామం కనుక, దానిని అగ్రహారం, అని వ్యవహరిస్తారే కాని, వాస్తవానికి అది జమీందారీ గ్రామం. ఒక పర్యాయం, ఒక జమీందారు తన తండ్రి తాతల పద్ధతిగా, గ్రామం వెలుపల మేనా దిగి గ్రామంలోకి రాకుండా సరాసరి మేనాను గ్రామంలోనికి పోనిమ్మన్నాఁట! ఒక్కొక్క బ్రాహ్మణుడు, ఒక్కొక్క కొబ్బరిబొండం కానుకగా తీసుకువచ్చి మేనా నింపడంతో, జమీందారుగారు ఉక్కిరిబిక్కిరై, మేనాదిగి, గ్రామంలో నడువవలసి వచ్చిందిట! ఇది ఒకనాటి చరిత్ర.

ఆ గ్రామంలో విద్యావేత్తలలో, క్రమంగా, ఒకరిమీద ఒకరికి అసహనం ప్రబలింది. ఆచారం సన్నగిల్లడం ప్రారంభించింది. అల్లా కొంతకాలం సాగింది. ప్రస్తుతం ఒక కర్మిష్ఠి మాత్రమే ప్రాచుర్యంలోకి రావడంవల్ల, పలువురకు ఆయన అంటే అసహనం. పొరుగూరివారుకూడా ఆయననను గౌరవిస్తారు. సంపన్నుడు, ఆయన ఎవ్వరి జోలికిపోయే మనిషికాదు. వారి పూర్వులు యజ్ఞం చేసినవారవడంచేత ఆయన పేరు సోమయాజులుగా వాడుకలోకి వచ్చింది.

అసహనం ఎంతపని అయినా చేస్తుంది. ఆయన ఎక్కువసేపు ఇంట్లో కూర్చుని జపం చేసుకుంటే, ఆయన గంటన్నర ముక్కు పట్టుకు కూర్చుంటాడని, చాటుకుండా ఆక్షేపించడం ప్రారంభించారు కొందరు. ఎవరయినా భోజనానికి పిలిస్తే, వీధిలో వెళ్ళేటప్పుడు, పులి విస్తరాకులుకాని గుడ్డపీలికలుకాని, త్రొక్కితే తిరిగి స్నానం చేయవలసి వస్తుందని జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ ఆయన వెడతాడు. అందరి మోస్తరుగా సాఫీగా నడవకుండా, అంగలూ, పంగలూ చాపుకుంటూ నడుస్తాడని ఒక ఆక్షేపణ. అగ్ని కార్యాలు వగైరా అయిన తర్వాత, రెండు జాములతర్వాత భోజనం చేయడం ఆయన అలవాటు. ఇదంతా భేషజం అని, ఒక ఆక్షేపణ.

ఇవన్నీ బాధించేవికాదుకాని, శూద్రులచేత ఏదయినా పని చేయించుకొనికాని, భోజనం పెట్టడని, ఒక ఆక్షేపణఉంది. ఈ విచిత్రమైన నియమ రహస్యం ఎవ్వడో కనిపెట్టి, మరొకడికి ఊదాడు. అంతే! అంటుకుపోయింది. "ఇది నిజమా?" అని, ఒక అభాండురాయి సోమయాజులును నిగ్గదీసి అడిగాడు. ఆయన నసిగాడు. అతడు ఖాయం చేసుకుని ఊరంతా వ్యాపింపజేశాడు. "ఇదేం నియమం! పిచ్చి నియమం. మనం ఉన్నది శూద్రరాజ్యంలో అయితే,ఇల్లాంటి చేదస్తాలు పెట్టుకుంటే, ఎప్పుడోకప్పుడు ప్రాణం మీదికి వస్తుంది. ఈయన కారణంగా, వారందరు బ్రాహ్మణులనూ ద్వేషిస్తారు" అన్నాడు, ఒక వృద్ధుడు. ఒక అసహనపరుడు, దీనిని జమీందారు దృష్టికి తీసుకు వెళ్ళాడు. "నా జమీందారీలోనే అంత చేదస్తపు బ్రాహ్మణుడున్నాడా? నేను చతుర్థ కులజుణ్ణి! నాకు కూడా పని చెప్పే అన్నం పెడతాడా?" అన్నాడు. "అంతే అనుకోవాలి" అన్నాడాతడు.



"అయితే, పరీక్షిస్తాను!', అన్న మాటలు అప్రయత్నంగా వెలువడినై.

"ప్రభువులు చక్కగా సెలవిచ్చారు, ఈ గర్విష్ఠ నైష్ఠికుడు తానే బ్రాహ్మణుడైనయట్లు, మేమంతా కానట్లు, మా ప్రాణం తీస్తున్నాడు. తమరాపనిచేస్తే గ్రామానికి గొప్ప ఉపకారం చేసినట్లు!" అన్నాడు, సవినయంగా అసహనపరుడు.

* * *

ఠాణేదారు ద్వారా సోమయాజులుకు కబురు అందింది—ఫలానా రోజున, జమీందారుగారు వారి యింటికి వచ్చి, తీర్థ ప్రసాదాలు స్వీకరించి, భోజనం కూడా చేస్తారని. సోమయాజులుకు పచ్చి వెలక్కాయ గొంతుకను పడ్డట్లయింది. జమీందారుగారు స్వయంగా కబురుచేస్తే భోజనం పెట్టనని ఎట్లా అనగలడు? తన నియమం ఎల్లా వదులుకోగలడు?

ఊళ్ళో కొందరు అసహనపరులకు కడుపులో అరటిపళ్ళు పిసికినట్లుగా అయింది, ఈ వార్త. పిచ్చి బ్రాహ్మణుడు, కత్తినాగటి సందున పడ్డాడనుకున్నారు కొందరు. ఠాణేదారు చెప్పిన గుర్తుల ప్రకారం, సోమయాజులుగారి వాకిట ముందు మేనా దింపారు, బోయీలు. తర్వాత ప్రక్కనే చెరువు కట్టన చెట్ల నీడకు ఖాళీ మేనాను తీసుకుపోయారు. జమీందారుగారు మేనా దిగినప్పుడు ఠీవిగా నిలబడ్డారు. ప్రక్కన గ్రామస్థులు నడుముకు ఉత్తరీయాలు చుట్టుకొని వినయంగా నిలబడ్డారు. పిల్లలు గుమిగూడి "మనఊరు పే నా వచ్చింది" అని చెప్పుకున్నారు. సోమయాజులు జమీందారుకు స్వాగతంచెప్పి లోపలకు ఆహ్వానించాడు. వచ్చిన వెంటనే ఆయన కొడుకు తలుపు గడియపెట్టేశాడు.

లోపలకు రావాలనుకున్నవాళ్లకు కసకసగా ఉంది. "తన యింటికే మహా, జమీందారు

# నియమ పరీక్ష

వచ్చాడని పిడిసిపాటు! ఊరంటే బొత్తిగా లక్ష్యంలేదు.'' అన్నాడొక గ్రామస్థుడు, అసహనపరుడు.

''ఇది ఆయన యింట్లో కార్యంకాదు. మనలనేమీ మేళతాళాలతో పిలువలేదు. ఏదో ప్రసాదం తినిపోదామని, జమీందారు భక్తిశ్రద్ధలతో వారింటికివస్తే, మనం అంతా ఆ యింట్లో చేరబడి తిరునాల చేయరాదు. అది వారిద్దరికి సంబంధించిన వ్యవహారం'' అన్నాడొకడు.

''అసలు జమీందారు వారింటికెందుకొచ్చాడో, కథ ఏమిటో, కమామిషు ఏమిటో ఈ బ్రాహ్మడికి తెలియదురోయ్'' అన్నాడొకడు.

''ఏమయినా ఇది గ్రామ వ్యవహారం కాదు. మనకిక్కడ స్థానం లేదు. వెళ్ళిపోవడం మంచిది'' అన్నాడింకొకడు.

మొత్తంమీద ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు.

* * *

సోమయాజులువి ఒకే ఆవరణలో ఉన్న రెండు గృహాలు. ముందు ఉన్న ఇంట్లో పెద్ద హాలు, వెనుక ముందు, వసారాలు ఉన్నవి. దానికి వెనుకనున్న గృహం కూడా ఇంచుమించుగా అంతదే. అందులో పాకశాల, దేవతా గృహం ఉన్నవి. భోజనాలన్నీ అక్కడే. జమీందారు రాక విని, దేవతా మందిరాన్ని ముందు గృహంలో హాలులోకి తరలించాడు. పూజ, అభిషేకం, అన్నీ ఇక్కడే ఏర్పాటు చేశాడు. అభిషేకం సమంత్రకంగా పూర్తి అయింది. పూజ ప్రారంభం అయింది. ఆయన శ్రద్ధా భక్తులకు జమీందారు ఆశ్చర్యపోయాడు. తానుకూడా తన్మయస్థితిలోనే ఉండిపోయాడు. మధ్యాహ్నం ఒంటిగంట అయినా, జమీందారు ఇంటి దగ్గర క్షీరం సమృద్ధిగా తీసుకురావడంచేత, ఆకలి కాలేదు. గోడను ఆనుకుని తివాచీమీద అల్లాగే చూస్తూ కూర్చున్నాడు.

ఇంతలో సోమయాజులు అవతల ఇంట్లో ఉన్న భార్యను పిలుస్తూ, ఒక కేక పెట్టాడు. పలికినట్లు లేదు. పిల్లవాణ్ణి పేరుతో పిలిచి కేకపెట్టాడు. సమాధానం లేదు.

''ఒక్కరూ పలుకలేదు. నేను పూజలో నుంచి లేవడానికి వీలులేదాయె. పూలబుట్ట నాకు చేతికందే దూరంలో అయినాలేదు'' అని, బిగ్గరగా సణిగాడు.

జమీందారుకు ఎదురుగా కుర్చీపీటమీద పూలసజ్జ కన్పిస్తోంది.

''నేను ఇవ్వవచ్చునా? ఇస్తే తమకు పనికివస్తుందా?'' అన్నాడు, జమీందారు.

''అయ్యో! ఎంత మాట! తమరా!'' అన్నాడు, సన్నగా.

"ఫర్వాలేదు. దైవకార్యం కదా !" అని, లేచి, పూలబుట్టను దగ్గరగా ఉంచాడు. సోమయాజులు దానిపై తమలపాకుతో నీళ్ళు చల్లి, పూజ కొనసాగించి ముగించాడు. అవసర నైవేద్యం పెట్టాడు. తీర్థం ప్రసాదం తాను గ్రహించి, తర్వాత జమీందారు కిచ్చాడు; ఆశీర్వదిస్తూ.

తిరిగి ఇంట్లోకి ఒక కేకపెట్టాడు. కొడుకు వచ్చాడు.

"వసారలో తఖ్తా బల్లమీద జమీందారు గారికి ఆ తివాసీ వేయమన్నాడు" కొడుకు వేశాడు. అక్కడ తాను కూర్చోవాలి కాబోలునని జమీందారు వెళ్లి కూర్చున్నాడు. వెంటనే తలుపువేసి "మహా నైవేద్యం తీసుకురండర్రా !" అని, అరిచాడు. వచ్చినట్లు గుర్తుగా గంట మ్రోగింది. తర్వాత ఆ మహానైవేద్యాన్ని అవతల ఇంట్లోకి తీసుకు వెళ్లడం, తిరిగి తలుపులు తెరవడం జరిగింది. దేవాలయాలలో అల్లా జరగడం, జమీందారుకు తెలుసును కనుక దానిని గూర్చి ఆశ్చర్యపడలేదు.

వసారాలో జమీందారుగారికి భోజనం ఏర్పాట్లు ఘనంగా జరిగినై. షడ్రసోపేతమైన భోజనం. వెళ్లబోతూ, తాంబూలంలో నూట పదహార్లు ఉంచి తాంబూలం ఈయబోయాడు జమీందారు. భగవత్సన్నిధానంలోనే ఉంచండి — అని, హాలులో గర్భ గృహంలో ఉన్న ముక్కాలిపీట వంకకు వేలు చూపించాడు.

"పూజ చూశాం, ప్రసాదం స్వీకరించాం, సంతోషమయింది" అన్నాడు, జమీందారు. "ఈశ్వరుడే మిమ్మల్ని ఇక్కడకు రప్పించాడు. లేకపోతే మా గృహంలో తమవంటి వారెందుకు అడుగుపెడతారు !" అన్నాడు, సోమయాజులు, సెలవు తీసుకుంటూ.

తలుపులు తెరువబడినై. వీధిలో జమీందారు రాక కెదురుచూస్తున్న బ్రాహ్మణులకు తలకొక రూపాయి యిచ్చాడు. దగ్గరలోనే ఉన్న మేనా దగ్గరకు వెడుతూ ఉంటే "మీకేమయినా పని చెప్పాడా, మా సోమయాజులు ?" అని, సన్నగా అడిగాడు, అసహనపరుడు. జమీందారు తల అడ్డంగా త్రిప్పి, మేనా ఎక్కాడు.

అతగాడు ఊళ్లోకి ఉత్సాహంగా వచ్చాడు. నడిబజారులో రంకెలు వేయడం ప్రారంభించాడు. "శూద్రులకు పని చెప్పకుండా, అన్నం పెట్టననే వ్రతం ఉన్న సోమయాజులు, ఏ పనీ చెప్పకుండా జమీందారుకెల్లా అన్నం పెట్టాడు ? మొత్తా లావయితే, కులం అక్కర్లేదనేగా ! ఆయనకు పని చెబితే, పీకె కత్తిరించుకుపోతుందని, కుక్కినపేనల్లే అన్నంపెట్టి పంపించాడు ! ఏమి సోమయాజులు ! భాగ్యవంతుడికొక న్యాయమూ, పేదవాడికొక న్యాయమూనా ? ఇదేనా బ్రాహ్మణత్వం !" అన్నాడు.

"ఏమీ పని చెప్పలేదని జమీందారుగారు నీకు నోటితో చెప్పారా ?" అని, ప్రశ్నించాడొక వృద్ధుడు.

"నోటితో చెప్పడంకంటె ఎక్కువ ! తల అడ్డంగా త్రిప్పేశాడు !"

"అల్లాగా ? నియమం నియమమే! ఇక్కడ సడలించుకున్నాడు. ప్రాణవిత్త మానభంగమందు అసత్య మాడవచ్చునని శుక్రాచార్యులు చెప్పినట్లుగా" అన్నాడా వృద్ధుడు.

* * *

జమీందారు తన నెలవు జేరుకున్నాడు. ఊళ్లోలేని దివాన్ వెంటనే వచ్చి దర్శనం చేసుకున్నాడు. జమీందారు తన ప్రయాణం సంగతి చెప్పాడు. దివాన్ నవ్వి ఊరుకున్నాడు.

"దివాన్ జీ! అల్లా వెళ్లడం మంచిది కాదంటారా ?"

"నేను బ్రాహ్మణుణ్ణి కదా !"

"మా దివాన్ మాటల మీద మాకు విశ్వాసం. అల్లా పరీక్షించకూడదా ?"

"పరీక్షలో ఏమి తేలింది ? దాని వలన ప్రయోజనం ఏమి కలిగింది ?"

"సోమయాజులు గారి కల్లాంటి నియమమే లేదనితేలింది. అల్లా తేల్చుకోవడమే ఒక ప్రయోజనం. అది ఒక సరదా."

"కర్మిష్ఠులతో చెలగాటం ఏమిటి ? వారు మీకు కూడా పనిచేయనిదే అన్నం పెట్టమని అన్నారనుకోండి! గ్రామస్థులయెదుట అవమానం భరించేవారా, లేదా, వారిని శిక్షించేవారా ?"

జమీందారు నిరుత్తరుడయాడు.

"మీరు చెప్పింది ఆలోచించవలసి ఉండెను. కాని అదృష్టవశాత్తు సుఖాంతమే అయింది. కాని వాది తొందరపాటు చర్యే."

"ఎవరి నియమాలు వారివి, వానికి పరీక్ష ఎందుకు ? ఆ నియమంవల్ల ఇతరులకు నష్టం కలిగితే అప్పుడు దానినిగూర్చి విచారణ చేయవలసి వస్తుంది" జమీందారు మాట్లాడలేదు.





# నియమ పరీక్ష

''వారు భోజనం చేసిన తర్వాత మీకు వడ్డించారా ? లేక తమకేముందు వడ్డించారా?''

''వారు భుజించిన తర్వాతే. నేనే వారిని ముందు భోజనంచేయమని చెప్పాను.''

''ఒక ధర్మ సంకటంలో నుండి వారిని తప్పించారు''

' ఆదేమిటి ?''

''బ్రాహ్మణుల ఇళ్లలో ఆచారాలు ఆశ్చర్య కరంగా ఉంటవి. మీరు ఆ వంటలో ముందు భోజనంచేస్తే అది పాత్రోచ్ఛిష్టం అవుతుంది. ఆ వంట వారికి పనికిరాదు. ఆ వంటలో మీకు వడ్డించకుండా, విడిగా మీ కోసం ప్రయత్నం చేస్తే, అది భగవత్ప్రసాదం మీకు పెట్టినట్లు కాదు ''.

''అంతా గందరగోళంగా ఉంది.''

''నియమాలు కొన్ని కులాలకు సంబంధిం చినవిగా ఉంటాయి. వారి వంటశాలలో వారితో పాటు కాకుండా, వసారాలో బయట మీకు వడ్డిస్తే, అది ఆ గృహ నియమం అని అనుకో వాలి కాని, మిమ్మల్ని అవమానించడానికి అలా చేశారని అనుకోరాదుకదా !''

''సత్యం !''

''అల్లాగే, వ్యక్తులకు కొన్ని నియమాలు— వారు విధించుకొన్నవి – ఉంటవి. కొందరు సూర్యుని చూసికాని, భోజనం చేయరు. సూర్యుడంటే ఒక గోళం—అల్లాంటి నియమాన్ని విధించుకోవడం ఒక మూర్ఖ విశ్వాసం అని, – ఆ నియమ శీలిని భోజనానికి మనం నిర్బంధించలేము.''

''అంతేకదా !''

''అల్లాంటిదే సోమయాజులుగారికి కూడా ఒక నియమం ఉందని అనుకుందాం. అది కులానికి సంబంధించినదే అయినా, అది ఇతరు లను బాధించేదేమీకాదు. అది వ్యక్తిగత నియమం. శూద్రులందరినీ మా యింటిలో పనిచేస్తే మీకు భోజనం పెడతాను రమ్మని ఆయన 'టముకు' వేయలేదు. అల్లా అందరికీ ఆయన భోజనం పెట్టలేదుకూడా ! వారి యింట్లో భోజనం కావలసిన మనిషి మాత్రం వారి నియమం పాటిస్తాడు. పాటించనంటాడా, అతనికి పనీ లేదు భోజనములేదు. ఇది యిష్టాయిష్టాలకు సంబంధించిన విషయమేకాని, నిర్బంధం కాదు. కాని ఆ సోమయాజులు విధించుకున్న నియ మానికి భంగం కలిగితే మాత్రం, ఆయన బాధ పడతాడు. అలా బాధించడంవల్ల మనకు వచ్చే ప్రయోజనంలేదు. అది వ్యక్తిగత నియమమే కాని, కులద్వేషం కాదుకదా !''

''నేను ఇంతగా ఆలోచించలేదు. నావల్ల ఆ బ్రాహ్మణునికి మనస్సులో బాధకలిగిందేమో!'' అన్నాడు, జమీందారు.

''ఇంతటి ఆర్ద్ర హృదయులకు వారిని పరీక్షించాలనే సంకల్పం కలగడం ఆశ్చర్యకరం నిజంగా ఆ సోమయాజులుగారికి అంత కఠోర నియమమే ఉంటే, పీక తెగిపోయినా సహిస్తాడు కాని, నియమం వదలుకోలేదు. మీకు భోజనం పెట్టాడు అంటే, ఏదో ఒక పని మీకు చెప్పే ఉంటాడు. ఏకాదశీవ్రత నియమం ఉన్నవాడు, బలవంతాన నోట్లో అన్నం క్రుక్కితే సహిస్తాడా? అల్లాగే ఎవడూ నియమ భంగాని కంగీకరిం చడు.''

''నాకు పని అయితే చెప్పలేదు, కాని—''

''కాని – ?''

''నా అంతట నేనే ఒక పని చేశాను !''

''ఏమి చేశారు, మహాప్రభో! సెల వీయండి ! ''

''ఆసనంనుండి లేచి పూలబుట్ట అందిం చాను'' అంటూ, జమీందారు జరిగినదంతా చెప్పేశాడు.

దివాన్ పకపకా నవ్వాడు.

''స్వామీ ! తమ వంటివారు వచ్చిన తరు ణంలో ఆ గృహస్థు పిలిస్తే, భార్య పలుకకుండా ఉంటుందా ? పుత్రుడు పలుకకుండా ఉంటాడా? వంటశాల, లేక అందని దూరంలో లేదు కదా ! నైవేద్యం తీసుకురమ్మంటే వచ్చినవారు ముందు మాత్రం ఎందుకురారు ? సోమయాజులుగారు పూలబుట్టను తనకు అందనిదూరంలో కావాలనే ఉంచి ఉంటారు. నైవేద్యం పట్టుకు రమ్మ నప్పుడుతప్ప మిగిలిన పిలుపులకు పలుకవద్దని కూడా భార్యాపుత్రులతో ముందే చెప్పిఉంటారు. తాను మీకు పని చెప్పినట్లుగా కాకుండా, మీ అంతట మీరే పనిచేయడానికి వీలుగా గొణుగు కొని ఉంటారు. మీ దృష్టి పూజమీద ఉన్నది కనుక, అది దైవకార్యంకనుక, ఆ సందర్భంలో తమరు పనిచేస్తున్నట్లుగా తమరు అనుకొని ఉండరు. తర్వాతకూడా ఇది చిన్నవిషయం కనుక తమకు జ్ఞాపకమూ ఉండి ఉండదు. ఇప్పుడు ప్రసంగంలో జ్ఞాపకానికి వచ్చింది !'' అన్నాడు, దివాన్.

''ఎంతపని చేశాడు, బ్రాహ్మడు ! మీరు విప్పిచెప్పిన తర్వాత, అంతా సరిపోయింది. నాచేత కూడా పని చెప్పకుండా పని చేయించాడు. నేను అది పని అని అనుకోలేదు'' అని, పక పకా నవ్వాడు, జమీందారు.

''పాటు చేసే వాళ్లు వస్తే, వాళ్లచేత కట్టెలు కొట్టించేవాడు. తమరు సుకుమారులు కనుక మీ చేత సుకుమారమైన పనిచేయించాడు, దేవతా కైంకర్యంగా''

''నిజం. నియమాన్ని పరీక్షించాను. నేనే నెగ్గాననుకున్నాను. కాని— ''

''ఆ పైన తమరు మాట్లాడవద్దు,అంతా మరచిపోండి. మనము మాట్లాడవలసిన రాచ కార్యాలు చాలా ఉన్నాయి. ఆ బ్రాహ్మడి గొడవ మన కెందుకు !'' అన్నాడు, దివాన్. ★



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1983 దీపావళి కథల పోటీ

## మొత్తం రు. 6000ల బహుమతులు

ఎప్పటిలాగే ఈసారి కూడా దీపావళికి కథానికల పోటీ పెడుతున్నాము..... పోయిన్నేడాదిలాగే యీసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలను ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలో, ఆతరువాతి సంచికలో వేస్తాము. ఆ తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

## ముగింపు తేదీ 31.8.83 → బుధవారం...

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు. 600/- లు చొప్పున బహుమతుల ఇస్తాము. ఆ తరువాత బాలట్ లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. 650/-, రు. 550/-, రు. 450/- ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన మూడు కథలకు రు. 250/-ల చొప్పున మూడు కన్సొలేషన్ బహుమతుల అందజేస్తాము.

★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.

★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.

★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.

★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు ఏవో పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.

★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయం తోనే వేస్తాము.

★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాట ప్రచురణకు అంగీకరించాలి.

★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు పిలువబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఏ పరిస్థితులలోను తిప్పి పంపలేము.

—సం॥



# శ్రీ ఎన్. టి. రామారావుగారి చైతన్యవంతమైన నాయకత్వంలో సామాజిక న్యాయం, ఆర్థికాభ్యుదయం దిశగా ఆంధ్రప్రదేశ్‌లో ఒక సరికొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టడం జరిగింది !

శ్రీ ఎన్. టి. రామారావుగారి సారథ్యంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పాలనా నిర్వహణ బాధ్యతల్ని స్వీకరించి, ప్రాధాన్యతాక్రమాన్నిబట్టి ప్రణాళికా కార్యక్రమాల్ని తిరిగి రూపొందించే కృషిలో నిమగ్నమైంది. బలహీనవర్గాల సంక్షేమ కార్యక్రమాలకు నేడు ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యం యిస్తున్నది. ప్రజాభ్యుదయ పథంలో ఒక కొత్త శకానికి అంకురార్పణ జరిగింది. సాహసోపేతమైన, క్రియాశీలకమైన కార్యక్రమాల నెన్నిటినో ప్రభుత్వం చేపట్టి అమలుపరుస్తున్నది. కొత్త ప్రభుత్వం సాధించిన విజయాలు......... యివిగో.........

## కిలో 2 రూ. లకు బియ్యం

ప్రజల ముఖ్యాహారమైన బియ్యాన్ని 6 వేల రూ.ల వార్షికాదాయంమించనివారందరికీ కిలో 2 రూ.లకే ప్రభుత్వంసరఫరాచేస్తున్నది.

## గ్రామాలకు మంచినీరు

వందమంది జనాభాకు కనీసం ఒక్క మంచినీటి వనరునైనా కల్పించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. ఇంతవరకు 2086 గ్రామాలకు మంచినీటి సౌకర్యాన్ని కల్పించింది.

## బలహీనవర్గాల ఇళ్ల నిర్మాణం

ఈ వర్తమాన సంవత్సరంలో ప్రతి జిల్లాలో 10,000 శాశ్వత గృహాల్ని నిర్మించాలని, 2 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలను పంపిణీ చేయాలని ప్రభుత్వం ఉద్దేశించింది. ఇప్పటివరకు 26, 192 కుటుంబాలవారికి ఇళ్ళ నిర్మాణానికి ఆర్థిక సహాయం అందించడం జరిగింది. 1.39 లక్షల బలహీన వర్గాల కుటుంబాల వారికి ఇళ్ల స్థలాలు పంపిణీ అయ్యాయి.

## ఆర్థిక సహాయ కార్యక్రమాలు

ఈ కార్యక్రమాల క్రింద 1.17 లక్షల షెడ్యూలు కులాల కుటుంబాలకు, 0.19 లక్షల షెడ్యూలు జాతుల కుటుంబాలకు మార్జిన్ మనీ పంపిణీ చేశారు.

## మహిళా, శిశు సంక్షేమం

ఆర్థిక సహాయ పథకాలు, ప్రసూతి, గర్భిణీస్త్రీలకు పౌష్టికాహార కార్యక్రమాలు, ప్రతి జిల్లా ప్రధాన కార్యస్థానాల్లోనూ ఉద్యోగ మహిళావసతి గృహాలు, తిరుపతిలో మహిళా విశ్వ విద్యాలయం, ఆస్తిలో స్త్రీలకు సమాన హక్కు కల్పించేందుకు హిందూవారసత్వ చట్టాన్ని సవరించే ప్రయత్నాలు– యివి మహిళలకు సమాజంలో సముచితమైన స్థానాన్ని కల్పించడానికి ప్రభుత్వం తీసుకున్న అభ్యుదయకర చర్యలలో కొన్ని.

## నిరక్షరాస్యతా నిర్మూలన

6 – 11 సం.ల మధ్య వయస్కులైన సుమారు 40 లక్షల బాలబాలికల్లో శారీరక, మానసిక వికాసానికి వీలుగా రూ. 50 కోట్ల ఖర్చుతో కూడిన మధ్యాహ్న ఆహార పథకాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టింది. 40 రెసిడెన్షియల్ పాఠశాలలను ప్రారంభించడం, జాతీయ గ్రామీణ ఉపాధికల్పనా కార్యక్రమం క్రింద పాఠశాల భవనాల నిర్మాణానికి అధిక ప్రాధాన్యం యివ్వడం, విద్యాలయాల్లో కేపిటేషన్ ఫీజు రద్దుచేయడం, సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని ప్రారంభించడం, తెలుగు విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటుచేయాలని నిర్ణయించడం– యివి ప్రభుత్వం తీసుకున్న మరికొన్ని అభ్యుదయకరమైన చర్యలు.

## గ్రామీణాభివృద్ధి

పాడిపశువులు, దున్నలు, గొర్రెలు, పంపుసెట్లు మొదలైనవాటిని గ్రామీణులకు సరఫరాచేసి, వారి ఆర్థిక పరిస్థితుల్ని మెరుగుపరచడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. 1.24 లక్షల షెడ్యూలు కులాలకు, 0.14 లక్షల షెడ్యూలు జాతులకు చెందినవారితో సహా మొత్తం 1.43 లక్షల గ్రామీణ కుటుంబాలకు యీవిధమైన ప్రయోజనాన్ని ప్రభుత్వం కల్పించింది.

## భారీ సేద్యపునీటి ప్రాజెక్టులు

ప్రాణాధారమైన జీవనదుల జలాలను అడ్డగించి, బంజరు భూములను సాగులోకి తేవడం జరుగుతున్నది. మద్రాసు నగర పౌరుల దప్పిక తీర్చడానికి తరలించే కృష్ణాజలాలతో రాయలసీమ ప్రజల జీవితాల్లో కొత్త శకానికి నాందిపలికే ప్రయత్నమే తెలుగుగంగ పథకం. కాకతీయులనాటి తెలంగాణా ప్రాంతపు సిరిసంపదలను తిరిగి ప్రతిష్ఠించడానికి శ్రీరాంసాగర్ ప్రాజెక్టు రెండవదశ దోహదం చేయగలదు. శ్రీశైలం ఎడమగట్టు కాలువ రాయలసీమ, తెలంగాణా ప్రాంతపు రైతుల జీవితాల్లో కొత్త ఆశల్ని చిగురింపచేయగలదు.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR No. 19927/Advt./C4 83

# నేలపై నెలరాజు

అంగేరి బాలసుబ్రహ్మణ్యం

"ఏది ఏమైనాసరే ఈ ఆదివారం తెలుగు సినిమా చూసి తీరాల్సిందే " అని నిశ్చయించుకున్నాడు ముకుందరావు.

ముకుందరావు విజయవాడ నుంచి మద్రాసుకు ట్రాన్స్‌ఫర్ అయి ఆర్నెల్లవుతోంది. ఈ ఆర్నెల్లుగా ఒక్క తెలుగు సినిమా కూడా చూడకపోయేసరికి పిచ్చి పట్టేట్టుంది అతని పని.

సిటీలో ఒకటి రెండు థియేటర్స్‌లో రెగ్యులర్‌గా తెలుగు సినిమాలు ఆడుతూనే వున్నాయి. అయినా ఏంలాభం? ఆ టైమింగ్స్‌లో బయట ప్రపంచాన్ని చూడలేని దరిద్రపుకొట్టు ఉద్యోగం తనది – ఇలా రోజుకి కనీసం వంద సార్లయినా బాధపడిపోతూ వుంటాడు ముకుందరావు.

మొన్న లంచ్ టైమ్‌లో కొలీగ్ శంకరం మాటల మధ్య – ఇంటికి దగ్గరే వున్న మెయిన్ రోడ్ థియేటర్లో ఆదివారం తెలుగు సినిమా మార్నింగ్‌షో వేస్తున్నట్టు చెప్పినప్పుడు – మద్రాసుకు కృష్ణాజలాలు నచ్చినంతగా సంబర పడి పోయాడు ముకుందరావు !

అందువల్లే రోజూ పదిన్నరకుగాని దుప్పటి ముసుగు తీయని ముకుందరావు, ఆదివారం ఎనిమిదింటికే లేచి, గడ్డం గీసుకుని, స్నానం ముగించి ఎనిమిదిన్నరకల్లా రెడీ అయ్యాడు. ఉత్సాహంగా ఈలవేస్తూ గదికి తాళం వేయబోతూ "రావుగారు ..." అన్న పిలుపు విని వెనక్కితిరిగి చూశాడు ముకుందరావు.

నడుము మీద చేయి ఆన్చుకుని, ఇబ్బందిగా ఫీలవుతూ "రాత్రి హోటల్లో ఏం పెట్టాడో ఏమోగాని ... నాలుగ్గంటల నుంచి ఒకే కడుపు తిప్పడం ... లూస్ మోషన్స్ ... " అంటూ దగ్గరికి వచ్చాడు శంకరం.

"నేనూ అదే హోటల్లోనే తిన్నాను. మరి నాకేం కాలేదే ?" అన్నాడు ముకుందరావు.

"మీరు అదృష్టవంతులు ... దానికేం గాని ... రిక్షా ఒకటి తీసుకురండి రావుగారూ... డాక్టర్ దగ్గరికెళ్లాలి" అంటూ నీరసంగా కింద కూర్చున్నాడు శంకరం.

"లే ... లే ... కింద కూర్చోవద్దు. లేచి లోపల మంచంమీద పడుకో ఇప్పుడే రిక్షా తీసుకొస్తాను" అని అక్కణ్ణించి బయలుదేరాడు ముకుందరావు.

అక్కడెక్కడా రిక్షా కనిపించలేదు. మెయిన్‌రోడ్డుకు పోతేతప్ప లాభం లేదనుకుని – ఇవాళ కూడా తెలుగు సినిమా చూసే యోగం లేదనుకుంటూ వేగంగా నడిచాడు ముకుందరావు. రిక్షాస్టాండ్‌లో ఒకేఒక రిక్షావుంది.

కాళ్లు పైకెత్తి తలకిందులుగా కూర్చుని 'దినత్తంది' చదువుకుంటున్నాడు రిక్షావాడు.

"భారతినగర్‌కు వస్తావా ?" అని అడిగాడు ముకుందరావు వాణ్ణి సమీపిస్తూ.

"ఎత్తనా వదుతెరు ?" ఎదురు ప్రశ్న వేశాడు రిక్షావాడు.

"పదోవీధి" చెప్పాడు ముకుందరావు.

"పత్తురూబా ఆగుమ్" అన్నాడు రిక్షావాడు సీరియస్‌గా.

"అక్కణ్ణించి మెయిన్‌రోడ్డు మీదవున్న భవానీ క్లినిక్‌కు రావాలి," అన్నాడు ముకుందరావు.

"అప్పొ టొంటీ రుపీస్" అన్నాడు వాడు మరింత గంభీరంగా.

"రెండు ఫర్లాంగుల దూరానికి ఇరవై రూపాయలా ?" అన్నాడు ముకుందరావు ఆశ్చర్యంగా.

"నా వరమాట్టేన్... వేరె ఆళై పారుప్పొ" అనేసి బీడీ ముట్టించి పేపర్‌లో మునిగిపోయాడు వాడు.

అప్పుడే పక్కన మరొక రిక్షా వచ్చి ఆగింది.

"భారతినగర్ వరకు వస్తావా ?" అన్నాడు ముకుందరావు రిక్షావాడితో.

"కూర్చోండి పోదాం" అన్నట్టు చేయి ఊపాడు పాతికేళ్ళు దాటిన ఆ రిక్షావాడు.

రిక్షాలో ఎక్కికూర్చుంటూ "మా ఫ్రెండ్‌కి



## నేలపై నెలరాజు

ఒంట్లో బాగాలేదు. భారతినగర్‌లో వున్న మా ఇంటికివెళ్ళి, అతణ్ణి ఈ భవానీ క్లినిక్కి తీసుకు రావాలి. ఒకేమాట... పదిరూపాయలిస్తాను. మళ్లీ గొడవ చేయకూడదేం? తెలిసిందా?'' అన్నాడు ముకుందరావు.

సరే అన్నట్టు తలూపాడు రిక్షావాడు.

ఇంటికి వెళ్లి శంకరాన్ని తీసుకుని క్లినిక్ చేరేసరికి గంట తొమ్మిదిన్నర అయింది. సినిమా ఆశకు పూర్తిగా తిలోదకాలిచ్చేశాడు మనసులో ముకుందరావు.

శంకరాన్ని పరిశీలించిన డాక్టర్, అతణ్ణి వెంటనే పెద్దాసుపత్రికి తీసుకుపొమ్మన్నాడు. శంకరానికి కలరా సోకి వుండవచ్చునీ, జాప్యం చేస్తే ప్రాణాపాయం కలగవచ్చునీ వేరే హెచ్చరించాడు డాక్టర్.

ముకుందరావుకు కాలూ చెయ్యీ ఆడలేదు. అక్కణ్ణించి పెద్దాసుపత్రికి ఆటోలో వెళ్లాలంటే పాతికరూపాయలైనా అవుతాయి. జేబులో పదిహేను రూపాయిలే వున్నాయి. దేవుడిపై భారంవేసి ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లో వెళ్లడంతప్ప వేరే మార్గం కనిపించలేదతనికి.

''రైల్వేస్టేషన్‌కి పోనియ్,'' అని శంకరాన్ని మళ్లీ రిక్షాలోకి ఎక్కించి, పక్కన కూర్చున్నాడు ముకుందరావు. శంకరం అతని తొడమీద తల వాల్చి పడుకున్నాడు.

ఐదు నిమిషాల్లో రిక్షా రైల్వేస్టేషన్ చేరింది. శంకరాన్ని కిందికి దించడంలో రిక్షావాడు ముకుందరావుకు సాయపడ్డాడు.

రిక్షావాడి చేతిలో పది రూపాయలుపెట్టి, శంకరాన్ని పట్టుకుని మెల్లగా స్టేషన్ వేపు నడిపించాడు ముకుందరావు.

''సార్......'' అన్నాడు రిక్షావాడు.

వెనక్కు తిరిగి చూసిన ముకుందరావుకు ఒళ్ళు మండుకొచ్చింది.

''మొదటే చెప్పానుగదయ్యా గొడవ చేయొద్దని... ఎంత చెప్పి ఏం లాభం? మీ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు'' అంటూ జేబులోంచి చిల్లర తీశాడు ముకుందరావు.

''అందుక్కాదు బాబూ... పేసంట్ సీరియస్ అన్నారుకదా డాక్టరు. రైలు కెళ్తే ఆలస్యమయుద్ది... తొరగా టాక్సీలో ఎల్లండి బాబూ... తమదగ్గిర డబ్బులున్నవో... లేవో... తీసుకోండి బాబూ... తర్వాత ఇద్దురుగాని...'' అంటూ తన చొక్కా జేబులోంచి పదిహేను రూపాయలు తీసి ఇవ్వబోయాడు రిక్షావాడు.

ఇన్నాళ్లూ, సినిమా కథల్లో మాత్రమే మానవతా మూర్తులు కనిపిస్తారనుకొనే ముకుందరావుకు— నిజంగానే అలాంటి వ్యక్తి తన కళ్లముందర కనిపించేసరికి కొంతసేపు నోట మాట రాలేదు. ★

## చోదకులు లేని విమానం!

భారతదేశానికి చెందిన ఎయిరో నాటికల్ డెవలప్మెంట్ ఎస్టాబ్లిష్మెంట్ అనే సంస్థ విమాన చోదకులు అవసరంలేని వో విమానం నిర్మించి జూలై 29వ తేదీన బెంగుళూరుకు 70 కిలోమీటర్ల దూరంలోవున్న కోలారు ప్రాంతంలో గగనంలోకి వదిలి చక్కని ఫలితాలను పొందారట. భూమిమీంచి రాకెట్‌ను కంట్రోలు చేసినట్టు ఆ విమానం కంట్రోలు చేయబడుతుందట. ఇది స్వదేశీ మొట్టమొదటి యీ తరహా విమానమట — మనవాళ్లేమీ చెవలాయలు కారు — మేధస్సంపదలో.

## భార్యకు గిల్టు నగలు భర్తకు దెబ్బలు!

హైదరాబాదు హెచ్.ఏ.ఎల్. క్వార్టర్స్‌లో వో యిల్లాలు ప్రాతఃకాలంలో ఇంటిముందు వూడ్చి, నీళ్ళు జల్లి, ముగ్గేస్తూండగా వో ముష్కరుడొచ్చి ఆమె మెడలోంచి వ్రేలాడు బంగారు గొలుసును యిట్టే లాగి, అట్టే అంతర్ధానమైపోయాట్ట. ఆనక మరో రోజావిడ తన భర్త పిల్లలతో సినిమా కెళ్ళడానికో బస్టాపులో నించొనుండగా వో



మోటరు సైకిలాగిందామె ముందు. వెనుక సీటుమీద కూర్చున్న వో దుర్మార్గుడు ఛట్టున దిగొచ్చి ఆమె భర్తను పట్టుకుని వో రెండు వుతికి "భార్య మెడలో చిలకలూరిపేట బంగారం గొలుసా వేస్తావ్. అంత సంపాయిస్తున్నావు. బంగారం అఘోరించిలేవా అని గద్దించి ఠక్కున మోటారుసైకిలెక్కేస్తే అది సర్రున పోయిందట — హోరి పిడుగా!



## చీమలని తిని ప్రాణాలు నిలుపుకున్న ధీరుడు!

యునైటెడ్ స్టేట్స్ అమెరికాకు చెందిన 22 ఏళ్ళ కారిబెల్ అనే యువకుడు ప్యారాచూట్‌తో దిగడంలో తరిఫీదు పొంది, వో దుర్ముహూర్తాన్న శాన్‌ఫ్రాన్సిస్కోకు 242 కిలోమీటర్ల దూరంలో వో ప్రదేశంలో తన విద్యను తానే ప్రదర్శించుకున్న సమయంలో ఎగిరి ఢుమ్మని దిగి వో లోయలో పడిపోయాడట. ఆ కొండల లోయలలో జూన్ 13న పడ్డవాడు జూలై 24 వ తేదీ బయట పడ్డాడట. ఈలోగా అతను తన శరీరంమీద పాకి, బాధించే చీమలను తింటూ ప్రాణాలను నిలబెట్టుకున్నాడట. ఆ కొండ లోయలో దొరికే రాళ్ళకుపట్టే పాచి, చీమలే నా ఆహారం ప్రాణం నిలుపుకోడానికంతకన్నా మార్గం లేదు అన్నాడట. ఈ కాలంలో నేను 24 కిలోల బరువు కోల్పోయాను అన్నాడట. బరువుపోయి నీరసంగా వున్నా అతని ఆరోగ్యం చక్కగా వున్నదని డాక్టర్లన్నారట— ఆయుఃరన్నం ప్రయచ్ఛతి అనగా యిదే కాబోలు.

## పెద్ద పథకంలో చిన్న పథకం!

మద్రాసులో బెస్ట్ అండ్ క్రాంప్టన్ కంపెనీకి చెందిన ప్రావిండెంటు ఫండు సెక్షనులో తాత్కాలిక వుద్యోగంలో చేరిన 30 ఏళ్ళ పార్థసారథి అనే వో చాణక్యుడు వో మూడు చెక్కుల మీద దొంగ సంతకాలు పెట్టి తొంభయ్యారు వేల రూపాయలు తస్కరించాడట. పోలీసులు పట్టుకు ఝుళిపిస్తే పెరట్లో పాతిపెట్టిన డెబ్బయివేలు కక్కేశాడట. నీకిదేం పోయేకాలమనడిగితే తానో చక్కని కంపెనీకి అద్భుతమైన పథకం వేసుకున్నట్టూ ఆ పథకానికావలసిన డబ్బుకే ఈ బుజ్జి పథకమేసినట్టూ విన్నవించాడట —

## శ్రీలంక మారణహోమంలో రెండు వేలకు పైగా తమిళుల వధ!

సేలనులో స్థిరపడిన తమిళులు తమకు సేలనులో విడి తమిళ రాజ్యం కావాలని చేసిన ఆందోళనకు ప్రతిఘటనగా సేలను ప్రభుత్వం చేపట్టిన మారణహోమం కార్యక్రమంలో సుమారు రెండు వేలకు పైబడిన తమిళులు నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపబడ్డారట.

## సోదరి హత్య!

సేలంలోని వో ఫారెస్టురేంజి ఆఫీసరు భార్య కణ్ణగి అనే ఆమెను సేలం శివాపేటలోని వారి యింట్లో పట్టపగలు ఎవరో ఓ దుర్మార్గుడు జొరబడి ఆమెను అతిదారుణంగా హత్య చేశాడట. నెత్తిమీద రోకలితో కొట్టి, తల పగిలి రక్తం వరదలై మెడమీంచి క్రిందికి పోయి కాలువగుండా రాడం చూసిన క్రింది వాటావారు భయాందోళనలతో పైకెళ్ళి యీ దాబుణాన్ని చూశారట. ఈ హత్య కేసులో ఆమెకు వరుసకు తమ్ముడైన వొహతను దొరికాడట. తనకామె వో మూడొందలడిగితే యివ్వలేదనీ, కోపంతో తానా పని చేశాననీ అతను అన్నాడట. హత్య వాతావరణం చూస్తే యీ కారణంకన్నా ఏదో పెద్ద కారణ ముండాలనీ, యీ మనిషేగాక యింకా కొందరైనా వుండితీరాలనీ పోలీసులు అనుమానిస్తోందట — కాంచన కనకాల మోహాన్నపడినివాడెవరు భజగోవిందం!

## దొంగ సర్టిఫికేట్లు సృష్టించినందుకు జైలు:

కేరళ రాష్ట్రానికి చెందిన తిరువనంతపురానికి చెందిన వో 21 ఏళ్ల జో ఫ్రాన్సిస్ అనే మేధావి ఏడుసార్లు ఎస్సెల్సీ పరీక్ష తప్పి, యిహ కట్టే వోపికలేక, తాను పి. యు. సి. పరీక్ష



ప్యాసయినట్టు మార్కులూ, టి. సి. లతో సహా దొంగ సర్టిఫికేట్లులు సృష్టించి యిమ్బిబియస్సులో సీటుకు అప్లికేషను పెట్టి లబ్బిన సంతోషించే సమయంలో యీ విషయం బయట పడి, చట్టానికి దొరికి ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్ష బహుమతి పొంది జైల్లో స్థిరపడ్డాడట. ★

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## అభినవ వేమన

## జోస్యము జనార్దనశాస్త్రి

విద్యాదదాతి వినయం — అన్న భర్తృహరి సూక్తికి లక్ష్యప్రాయులైన రాయలసీమ కవి రత్నాలలో ఒకరు మిత్రులు జోస్యము జనార్దన శాస్త్రిగారు 1911లో కర్నూలు జిల్లా పాణ్యం గ్రామంలో జన్మించారు.

"పుణ్యము, కవికోవిదుల
శరణ్యము, ఫలపుష్ప భరితరమ్యోద్యానా
గణ్యము, రసానుగుణ్యము,
పాణ్యము నా జన్మభూమి బలునాణ్యమ్మౌ
పెరయూరి పైడి యుప్పరిగె మేడలకన్న
తమ యూరి పూరికొట్టములు మేలు,
లాతిచో కామగవి కల్పలతలకన్న
మేలు తన యూరి యుస్మెత్త మేకపిల్ల."

అనే వాక్యాలు శాస్త్రిగారి అభిజన ఆభిజాత్యాభిమానానికి తార్కాణం. ముప్ఫై యేండ్లు అనంతపురం జిల్లా తాడిపత్రిలో ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా ఉండి, పదవీ విరమణానంతరం ఆ ఊరిలోనే స్థిర పడ్డారు. సాంప్రదాయకంగా సంస్కృత విద్యను అభ్యసించి ప్రైవేటుగా మదరాసు విశ్వవిద్యాలయం విద్వాన్ పట్టం అందుకొన్నారు. వేద విద్యా కవితా కన్యల వలచి వలపించుకొన్న రసికులు. పాఠశాలలకు పాఠ్య గ్రంథాలతోపాటు సరస సాహిత్య పద్య కావ్య రచనలోను శాస్త్రిగారి లేఖినికి మెలకువలు అలమినవి. కొంతకాలము తిరుపతిలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సాన్నిధ్యసేబలం ఆయనపై ప్రభావం చూపించింది. కృతిపతి అనే పేర గువ్వల చెన్నని కథకు కావ్యత్వం కలిగించి తొలి ఆంధ్రరాష్ట్ర ఉప ముఖ్యమంత్రి హోదాలో ఉన్న మాజీ రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డికి అంకితం ఇచ్చారు. ఇది కర్నాటక పట్ట పరీక్షకు కొంత కాలం పాఠ్య గ్రంథం. "ఇది రాజసుతులు చేయవలసిన పనులు కావుకావనుచు కాకమ్మలరచె — అన్న తిరుపతి వేంకటకవుల రచనకు దీటుగా ఏమిటి నైనన్ మృదులాత్మ పాటిగలరే మీ కొక్కొరొక్కొయనెన్ అని జనార్దనశాస్త్రిగారి రచన సాగినది." అని శ్రీ విశ్వనాధసత్యనారాయణగారు మెచ్చుకొంటూ పీఠిక వ్రాశారు. "ఉన్నమాట జోస్యమన్నమాట !" అనే మకుటంతో ఏడు వందల ఆట వెలదులను వేమన వలె వెలయించడంతో ఈయనకు 'అభినవ వేమన' బిరుదం లభ్చింది. ఈయన రచల్లో భావపుష్టి, ధారాశుద్ధి, విషయ సంయమనం, జాను తెలుగు తీపి పెనగొని ఉంటాయి. శ్లేషచమత్కారాలూ, వక్రోక్తులు ఈయనకు సహజ విలాసాలు.

తుదకు నెట్టుకైన ద్రుతభావ మందక
సరళత గన వవలి పరుష వర్గ
మనుగు సుకృతికైన తెనుగు వ్యాకృతిబోలె
ఉన్నమాట జోస్యమన్నమాట.

ఇలా చమత్కారాలతో కొనసాగిందీ రచన. ఈయన 'పసిడి పంట' రఘు వంశంలోని కౌత్స వరతంతు కథకు విస్తరణమైన మూడాశ్వాస కావ్యం; విద్యజ్జనామోదం పొందిన విమర్శలకు నిలచి నిబ్బరించుకొని, ఉస్మానియా, వేంకటేశ్వర విశ్వవిద్యాలయాల ప్రాచ్యపరీక్షలకు పాఠ్యగ్రంథమైనది.

కవి కుల గురూ క్షమింపుము
భవత్కథా వస్తువునకు వ్యాకోచము నం
దవక తవక లేమైనన్
దవిలె నాకో అస్మదజ్ఞతామూలమునన్—

శ్రీ జోస్యం జనార్దనశాస్త్రి



అని కాళిదాసుకు అంజలి ఘటించడం ఆయన వినయ సంపన్నత. ఈ కావ్యంలో గురు శిష్యసంబంధం పావిత్ర్యాన్ని నొక్కి చెబుతూ నేటి పరిస్థితికి

నరుండు విద్యాధ్యయనంబు సేసియున్
గురుండు బోధించుటకున్ విరుద్ధవౌ
ండు త్రోవన్ పెరిమన్ చరించినన్
పరిశ్రమల్ దండుగపాలు కావొకో !

ఈయన ఆవేదన చెందారు. శృంగారలహరి అనే అయిదువందల ఆటవెలదులు ముక్తకకావ్యం శాస్త్రిగారికి అగ్రతాంబూల మిప్పించి ఈ సంవత్సరం ఉగాదినాడు సికిందరాబాద్ త్యాగరాజ సేవాసమితి వారిచే కనకాభిషేకం జరిపించింది. ఈ కావ్యానికి ఆయనే సౌరభానుసారి అనే వ్యాఖ్య కూడ రచించారు,కవితాహృదయం కుమ్మరిస్తూ. శ్రీనాధుని సప్తశతి లభింపని లోపము శృంగార లహరి తీర్చినది — అని డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, తెలుగు దేశంలో హాలుడు, గోవర్ధనాచార్యుడు పుట్టని కొదువ శ్రీ శాస్త్రిగారి వలన తీరినది — అని ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు, పీఠికాకర్త డాక్టర్ దాశరథి మున్నగు వారి ప్రశంస లందుకొంది ఈ ముక్తకకావ్యం. మచ్చుకొక ఆటవెలది :—

నిజము నరయకుండ నీలాపనిందకే
కట్టుకొన్నదాని గడకు ద్రోతు
నిముస నిముసమునకు నీ చేయు నేరాల
కెట్టి పాచితంబు గిట్టదనియొ !

శాస్త్రిగారి వీరాంజనేయ విలాస కావ్యం సున్నితమైన హాస్యాన్ని అందిస్తుంది. ఒక ఆంజనేయ భక్తుడు తన స్వామి ప్రసన్నుడు కానందుకు—

ఎంకి విద్య బుద్ధి ఎంత విచక్షణ
లలితకళల నేర్పు కలిగియున్న
పెద్దనారిసేవ తద్దయు జేసిన
విడుచునెట్లు జాతివిహిత చేష్ట ?

అని గింజుకుంటాడు. శాస్త్రిగారి కుమారులలో ఒకరైన శ్రీ విద్యాసాగర్ రిజర్వ్ బ్యాంకులో అధికారిగా వున్నా తండ్రిగారి సాహిత్య సంప్రదాయాన్ని పుణికిపుచ్చుకొన్నవారు. విద్యాభరంతోపాటు వినయభరంతోను వినమ్రులైన శాస్త్రిగారు ఇంకా తమ జ్ఞానాన్ని ఆంధ్రావళికి అందిస్తూ శతమానమూ విరాజిల్లాలని కోరుతున్నాను.

## రాజధానిలో రాష్ట్రపతి :

రాష్ట్రపతి జ్ఞానీ జైల్‌సింగ్ జులై 15వ తేదీ సాయంకాలం ఢిల్లీనుంచి హైదరాబాదుకు వచ్చి, బొలారంలోని రాష్ట్రపతి నిలయంలో 18 రోజులపాటు మకాం చేసి,

ఆగస్టు 3వ తేదీ ఉదయం ఢిల్లీకి బయలు దేరారు. 18 రోజులలోను ఆయన వివిధ కార్యకలాపాలలో పాల్గొన్నారు. జులై 17న ఆయన అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రథమ వార్షికోత్సవ మహాసభను జూబిలీ హాలులో ప్రారంభిస్తూ, భాషా సంస్కృతులను రాజకీయాలకు ఉపయోగించుకోకూడదని హితవు చెప్పారు. దేశ సాంస్కృతిక సాహిత్య వికాసానికి తెలుగు భాష మహత్తర సేవ చేసిందని ప్రశంసించారు. జులై 19న ఆయన రాజమహేంద్రవరంలో నన్నయ కాంశ్య విగ్రహం స్థాపించారు. నన్నయ సంస్కృత మహాభారతాన్ని తెనుగుచేసి తెనుగు భాషకు నిండుదనం చేకూర్చారని ఆయన అన్నారు. రాజమహేంద్రవరం పురపాలక సంఘం పౌరసన్మానం స్వీకరించారు. జులై 24న స్థానిక గురుద్వారాలలో ప్రసంగిస్తూ, రాజకీయాలను మతంతో ముడిపెట్టవద్దని శిఖ్ఖులకు ఉద్బోధించారు. జులై 26న బోలారంవద్ద సాయుధదళాల సమావేశంలో ప్రసంగిస్తూ, సాయుధ దళాలు దేశప్రతిష్ట పరిరక్షణలో ఎటువంటి సవాళ్లనయినా ఎదుర్కోడానికి సిద్ధంగా వుండాలని ప్రబోధించారు. జులై 27వ తేదీన గాంధీ భవన్‌లో జరిగిన ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య యోధుల సమావేశంలో పాల్గొని వారివిషయంలో శ్రద్ధ తీసుకుంటామని హామీ యిచ్చారు. జులై 28న ఆయన తన గౌరవార్థం ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు స్వగృహంలో చేసిన విందులో పాల్గొన్నారు. జులై 31న ఆయన సికిందరాబాద్‌లోని శ్రీ ఉజ్జయిని మహాకాళి దేవాలయం దర్శించి సంఘంలో మహిళలకు పురుషులతో సమాన ప్రతిపత్తిని, గౌరవాన్ని కలిగించడమే పురాణ సారాంశమన్నారు. ఆగస్టు ఒకటవ తేదీన ఆయన గౌలిగూడాలోని గురుద్వారా సాహిబ్‌లో ప్రార్థనలు జరిపారు. లఘుపరిశ్రమల సేవాసంస్థ భవనానికి శంకుస్థాపన చేశారు. అర్హులకే రుణాలు మంజూరు చేయాలని సలహా యిచ్చారు. ఆగస్టు 2వ తేదీన ఆయన పత్రికా విలేఖరులగోష్ఠిలో ముచ్చటిస్తూ, హైదరాబాద్ నగర ప్రజలు సహనశీలురని ప్రశంసించారు. నగర ప్రజల ఆదరాభిమానాలకు చలించిపోయామన్నారు. సహనం ఆంధ్ర ప్రజలకున్న ప్రత్యేక భూషణమని ఆయన ప్రశంసించారు. ఆగస్టు 3న ఆయన ప్రత్యేక విమానంలో ఢిల్లీకి వెళ్ళారు.

**ఉపశ్రుతి :**

"గుడ్ మార్నింగ్ సిస్టర్" అన్నాడు కాన్వెంటు స్కూల్లో చదివిన విద్యార్థి తన సోదరితో.

"వెరీ గుడ్‌మార్నింగ్ బ్రా!" అన్నది సోదరి వెటకారంగా. ★

# ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

## న్యూఢిల్లీ లేఖ

జయదుబాషిగారి "తారాపూర్ కేంద్రాన్ని మూసేస్తే ఏమి ? —నేటి వెన్నుముకలేని పాలకులకు మన స్వాతంత్ర్యం మీద అంత నమ్మకం లేదు —" అంటూ చాలా చక్కగా వివరించారు.

బృందావనం లక్ష్మీనాథ్ (పెదజాగర్లమూడి)

* * *

12–8–83 సంచికలోని దుబాషిగారి న్యూఢిల్లీ లేఖ వాస్తవాలకు దర్పణం పట్టే విధంగా వుంది. నిజంగా తారాపూర్ కేంద్రం మూసేసి వాడేసిన ఇంధనాన్ని ఇతర సామాగ్రిని తీసుకెళ్ళమంటే అమెరికా ఏమంటుందో చూడాలి. అలాగే ఒక నిర్ణీత గడువులోపల తీసుకెళ్ళకపోతే దాన్ని మనమే శుద్ధి చేసుకుని వాడుకునే నిబంధన కూడ పెట్టాలి. అలా కాకుండా అతి ప్రమాదకరమయిన ఇంధన శేషాన్ని ఇటు శుద్ధి చేసుకోనీకుండా, అటు నూతన ఇంధనాన్ని సరఫరా చేయకపోవడం అమెరికా వితండవాదాన్ని ప్రతి మానవ హక్కుల సంఘం గర్హించితీరాలి. ఇంధనాన్ని మనంతట మనమే శుద్ధి చేసుకునే చర్యను ఏ అంతర్జాతీయ న్యాయ స్థానముకానీ, సంస్థకానీ విమర్శించదు సరికదా శ్లాఘిస్తుంది. అసలు ఈ అణు విద్యుత్ కర్మాగారాల వంటి తెల్ల ఏనుగుల వెంటబడటం వల్లనే మనల్ని అమెరికా ఈ రకంగా ఆడిస్తున్నది. అన్ని విద్యుత్తులోనూ కారుచౌక, నిరపాయ కరమూ అయిన జల విద్యుత్‌పై మన ప్రభుత్వం ఎందుకు శ్రద్ధ చూపదో అర్థంకాదు. ఏ అణు విద్యుత్ మీద ఆధారపడి ఈనాడు "స్విట్జర్‌లాండు" అగ్రగామి దేశం అయింది ? కేవలం జలవిద్యుత్తును పూర్తిగా వినియోగం లోకి తెచ్చుకునిగదా స్విట్జర్‌లాండ్ విద్యుత్తులో స్వయం సమృద్ధి సాధించింది. మరి స్విట్జర్‌లాండుకు ఎన్నో రెట్లు అధికంగా జలవనరులున్న మన దేశం జలవిద్యుత్‌పైన దృష్టిని కేంద్రీకరిస్తే చౌకగా నిరపాయకరంగా విద్యుత్ ఉత్పాదన చేసి అగ్రగామి దేశం అవుతుంది.

మండవ కిరణ్‌బాబు (సికిందరాబాదు)

## "సహించలేరు"

నటి మేనక ముఖచిత్రం ముగ్ధ మనోహ రంగా వుంది. తరచు ఇంత చక్కని ముఖచిత్రాలు వేస్తున్నందుకు మీకు నా అభినందనలు. ఎన్‌సైక్లోపిడియా, అందని ద్రాక్ష కథలు నాకెంతగానో నచ్చాయి. అందని ద్రాక్ష కథ శ్రీధర్ తన భార్య రచయిత్రి కావటం వల్ల అతడు ఆఫీసుతో అవహేళనలకు గురి అవుతాడ కొంతమంది రచనలు చేయలేరు. ఎదుటివా రచనల ద్వారా పేరు తెచ్చుకుంటే సహించలేరు

జి. వి. కష్ణారావు (రాజమండ్రి)



1983వ సంవత్సరానికి శ్రీ రాజాలక్ష్మీ ఫౌండేషన్ అవార్డు పొందిన ప్రొ. యలవర్తి నాయుడమ్మ

## ఆణిముత్యం

19–8–83 తేదీన ప్రచురితమై వ్యాసంలో వ్యాసకర్త ఇండియా, జపాన్ దేశ అభివృద్ధికి చెందిన భేదాలు కళ్లకు కట్టినట్లు వ్రాశారు. జపాన్ అభివృద్ధి సాధనలో, ఇంక మరెన్నో రంగాలలో ఆకాశంలో ఉన్నతి మార్గం అవలంబిస్తూ వుంటే, మన దేశం అధోగతి మార్గంలో పయనిస్తుందని చెప్పడా శ్రీ డా॥ జయదుబాషిగారి వ్యాసం ఒక ఆణిముత్యం.

## జన్మదిన శుభాకాంక్షలు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఏడున్నర శతాబ్దాలుగా, ఆంధ్రుల ఆదర్శాలకీ, ఆశయాలకీ, సంస్కృతికి ప్రతిబింబంగా ఉంటూ తెలుగువారి నందరిని ఆనందపరుస్తూ, ఈ ఏటి జన్మదినాన వజ్రోత్సవ సంచికగా వెలువడుతున్నందుకు మా కెంతో హర్షదాయకంగా ఉంది.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సందర్భంగా జన్మదిన శుభాకాంక్షలు అంద జేస్తున్నాము.

కొండవలస శ్రీనివాసరావు, కొండవలస సుశీల (టెక్కలి) ★

*Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.*

# "నేను కుట్టుపని నేర్చుకున్నప్పటినుంచి, ఒక పరిపూర్ణమైన స్త్రీమూర్తిగా అనుభూతి చెందుతున్నాను."









మీ పిల్లలకు బట్టలు. కర్టెన్లు, కుషన్ కవర్లు... ప్రత్యేకతగం ఒక టేబుల్ క్లాత్. మీ చీరకు ఫాల్ వేసుకోవడం. లేదా ప్రతివారం చిరిగినవి కుట్టుకోవడం. కుట్టుపని, ఒక స్త్రీ తన వ్యక్తిత్వాన్ని వ్యక్తపరిచేందుకు ఆనందదాయకమైన ఒక మార్గం.

ఇది మనకు తెలుసు. ఎందుచేతనంటే, భారతదేశంలో మరే ఇతర కుట్టుమిషను కన్నా కూడా ఉషా కుట్టుమిషన్‌తోనే ఎక్కువ మంది స్త్రీలు కుట్టుపని చేస్తారు. ఉషా మిషనుని వాడటం, నిర్వహణ తేలికని వారికి తెలుసు. భారతదేశంలో తయారయ్యే మరే ఇతర కుట్టుమిషనుకంటే కూడా, ఉషాకు అధికంగా ప్రత్యేక సదుపాయాలు ఉన్నాయని వారికి తెలుసు. దీనికి, భారతదేశంలోకల్లా పెద్దదైన విక్రయానంతర సేవ మద్దతు ఉందని వారికి తెలుసు.

రండి, ఈ రోజే ఒక ఉషాని జాగ్రత్తగా పరీక్షించండి.




అద్భుతమైన నాణ్యతకు ప్రతీక

ఉషా నం: 1 అయినది.
ఎందుచేతనంటే, దాని అద్భుతమైన నాణ్యతను అందరూ మెచ్చుకుంటారు.

ULKA-D-US-704

